శృంగారకావ్య గ్రంథమండలి ప్రబంధపరంపర — ౫

# మలహణచరిత్ర.

పెదపాటి ఎఱ్ఱనార్యుఁడు.



PUBLISHED BY
K. G. MURTHY
FOR SRUNGARA KAVYA GRANDHA MANDALI.
MASULIPATAM.



ఉ. పాటిగలట్టి మేటియెడ♦పాటిపురాధిప, యెఱ్ఱనార్య, నీ
సాటిగఁజెప్పినట్టి కృతి ♦ సాటువయై విలసిల్లుఁగా కిటన్
జాటుచు హీనమానవుల ♦ చాటునమాటున వ్యర్థకూటకా
ర్యాటకథల్ వినంగ నగు♦బాటగుఁగాక రుచింపనేర్చునే.

అని గ్రంథావతారికయందును ఆశ్వాసాంత గద్యములందును ఎడపాటి ఎఱ్ఱనార్యుఁడనియున్నది. ప్రబంధ రత్నావళియందు పెదపాటి ఎఱ్ఱనార్యుఁడనియున్నది. పై పద్యమున పెదపాటియనినను సరిపోవును. కాన యీ ఎఱ్ఱనార్యుని యింటిపేరు ఎడపాటియో! పెదపాటియో! విచారింపవలసియున్నది.

ఉ. ఇట్టి మహాప్రధాన పర♦మేశ్వర మూర్తివిగాన నీవు చే
పట్టితిమేలు చుండిపుర♦పాలక, కాళనమంత్రిచంద్ర, మున్
గట్టిగఁ గృష్ణరాయ జన♦కాంతునికీయక దాఁచినట్టి యా
రట్టడి యైన యెఱ్ఱకవి ♦ రాజిత మల్హణ కావ్యకన్యకన్.

అని యిందుదాహరించిన "కృష్ణరాయ జనకాంతుడు" క్రీ, శ. 1600 ప్రాంతములనున్న శ్రీకృష్ణదేవరాయలో! క్రీ. శ. 1700 ప్రాంతములనున్న నంద్యాల కృష్ణవిభుఁడో! తెలిసుకొనినగాని యీకృతి రచనాకాలము నిర్ణయింపఁజాలము.

నెల్లూరిమండలమున నున్న చుండిగ్రామకరణమగు చుండి కాళనమంత్రికి కృతినీయఁబడిన యీ ప్రబంధము శివభక్తి బోధనాపర

తంత్రిమై ప్రఖ్యాతసంస్కృత కవియగు మల్హణుని నాయకునిగాను ఆతని సహపాఠియగు పుష్పగంధియను వేశ్యాంగనను నాయికగాను శృంగార రసోపేతముగా కథను సాగించుటయేగాక స్వభావోచితములగు వర్ణనలతో, నాకాలపు వాడుక పదములతో చక్కగా వర్ణించినాఁడు.

ఈపద్యకావ్యమును 1937సంవత్సరములో మహారాజశ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారు గ్రంథపాతములతోఁ బ్రకటించిరి. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారపు వ్రాతప్రతితోను మావద్దగల ప్రతుల తోను సంప్రతింపఁగా మిగిలిపోయిన కొలఁది గ్రంథపాతములను మేమే పూరించి సంపూర్ణప్రతిగాఁ బ్రకటించితిమి.

ఈకవి రెండవకృతియగు "కుమారనైషధము" మాకు నింత వరకు లభింపలేదుగాన సహృదయులేరి యెయ్యదైనను నున్నయెడల మాకుఁ బంపఁగోరెదము.

వ్యవస్థాపకుఁడు.



ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున కృష్ణరాయయుగము క్రొత్తమార్గముల కాకరమైనది. ఆయుగమునంతటి నేలిన అల్లసాని పెద్దన, (ముక్కు) నంది తిమ్మన, ధూర్జటి మున్నగు కవులందరును శృంగారకావ్యములను వ్రాసిరి. ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయలు వాని నాదరించెను. ఆమ్మహారాజు పోషకత్వమున నాంధ్రభాషాయోష క్రొత్తతొడవులు గైసేసి రసికజనామోదము చూరగొన్నది. కృష్ణరాయల కాలమునందును కొంచెము తర్వాతను ఉద్భవించిన కావ్యరత్నము లొకదానికంటె ఒకటి మిన్నయై యొప్పారినవి. ఇవియన్నియు రత్నములే యయ్యును వర్ణములోను కాంతిలోను తళుకులోను ప్రత్యేకములై సొంపులీనినవి. ప్రబంధయుగ కవిత్వమంతయు శృంగార రసభూయిష్ఠమని కొందరు పలుకుదురు. కేవలము శృంగారరసభూయిష్ఠమైనంత మాత్రమున నేకావ్యమును దుష్టమన జెల్లదు. మరియు ప్రబంధములయందలి పాత్రలన్నియు నచ్చునబోసిన బొమ్మలనియు వానికి చైతన్యమనునది లేనేలేదనియు కొందరి ప్రఖ్యాత విమర్శకుల యభిప్రాయము. మనుచరిత్రము, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, విజయవిలాసము మున్నగు రసవత్ప్రబంధములు తత్కాల కవిలోక సామర్థ్యమును నిరూపించుటకుదాహరణములుగ పేర్కొనవచ్చును. ఈప్రబంధములలో కథగాని పాత్రలుకాని సన్నివేశములుకాని రచనాపద్ధతిగాని ఒకదానినొకటి పోలక ఒకదానికొకటి తీసిపోక పాఠకలోకము నాదరణముచూరగొన్నవని చెప్పుట అతిశయోక్తి కాజాలదు. కృష్ణరాయయుగమునకు పిమ్మట ఆంధ్రుల పరాక్రమ పౌరుషములెల్ల క్షీణించినవో ఆదరాభిరుచులును అట్లే కుంటువడినవి.

అందువలన ఆయుగమున ప్రభవిల్లిన కావ్యసంతతి అత్యుత్తమమైనది కాకపోయినప్పటికిని ఆయుగమందలి సాంఘిక జీవనమును ప్రజాభిరుచిని, ప్రతిబింబించునట్టిది. ఈదృష్టితో మనము చూడగలిగినప్పుడు ఏ కవిరచించిన కావ్యమునైనను శిథిలముగాకుండ రక్షించుట మనబాధ్యతయని తేటపడును. అందువలననే తంజావూరు సరస్వతీమహాలునందును మదారాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందును దొరకినన్ని పూర్వ గ్రంథముల వ్రాతప్రతులను సేకరించి సంరక్షించుట.

కృష్ణరాయయుగమునకు కొంచెము తరువాతవాడైన పెదపాటి ఎఱ్ఱనార్యుడు రచించిన మల్హణచరిత్ర యను నీకావ్యము శృంగారరస ప్రధానమయినది. ఇందలి నాయకుడు సంస్కృత వాఙ్మయమున నెన్నికగన్న మల్హణకవి. అతనికిని పుష్పగంధియను వేశ్యకును గల సంబంధమిందు ప్రస్తావింపబడినది. ఈకావ్యమునందలి ప్రధానకథ మల్హణుని కథ. ప్రాసంగికముగ శ్వేతుని వృత్తాంతమును చెప్పబడినది. ఈ రెండుకథలనుగూడ పాల్కురికి సోమనాథుని 'పండితారాధ్య చరిత్రము' నుండి గైకొనబడినవి. అందలి కథాప్రకారమిట్టిది.

## —♦ శ్వేతుని కథ ♦—

భూరి దివ్యామృతపూరశశేఖర, సారసరాప్సరోరసవంద్య రంగ
దనపాలనున్న మదనవికారాంధుడు, ఘనతర సంచితాఘసమేతు శ్వేతుఁ
గనుఁగొని సస్మితాననపద్మయగుచు, మానసమునఁ దలపోయ మగుచువీక్షించి
తజ్జపటేశ నిర్నిమిత్తమునఁ దన్ జూచి, చిఱునవ్వునవ్వన తెఱఁగేమి యనఁడు
సతిపరమాభావన సంత నాగంభ, ఘృతిపృష్ట సతని బోధింపంగఁ దలఁచి
దురితైకమూలంబు దుని నీచరిత్ర, పరికి దా కిపరింప నమ యొట్టు నిన
నను నీవెఱుంగఁజొచ్చిననాఁటనుండి, నిను నీవెఱుంగక నీమనోవృత్తి
గరిణిఁ దిరికాల మదగర్విష్టమైన, కరియునుఁ బోలెను గడుఁగడుఁ గ్రొవ్వి
పాయక రేయుచుఁ బగలుఁ గామినుల, మాయల విషయనిమగ్నతఁ గొంది
గుడిఁ గనిష్టైనను మృడ శరణవు, గడకంటనైనను గానవుగుడుల
మొక్కవు భక్తుల కొక్కనాడైనఁ, దక్కవు దుర్మార్గ మొక్కింతయైన
మున్ను రుద్రాక్షంబుముట్టయెఱుంగ, వెన్నడును ధరింప నెఱుగవు, భూతి

కర్మంబు ధర్మంబుఁ గామంబు నేమ, మర్మిలి భోగంబు యాగంబుగాఁగ
నడపును మఱియొక్కనాఁడు లంజియకు, వడిఁ బుష్పములు గొనివచ్చు నత్తఱిని
జెవసి పుష్పొకటి యంచితభూప్రదేశ,మునఁ దొగపడఁ బుచ్చికొనఁగ లజ్జించి
యదియు శివార్పితంబని యాలోక, మదిలోన నొక్కింతమాత్రంబుఁ దలఁప
నాపోవ నొండేమి యని దొలుమేని, నీపుణ్యఫలమునఁ బ్రాపించెనట్టి
తలఁపటఁ గాన తత్ఫలమున నపుడ, ఫలియుంచె దేవేంద్రపట్టంబు నీకు
నయుఁ డాయుష్యఫలానుభవమున , నిది యొక్క దినము దా నిట్లుగావునను
నీనిదు నరకాగ్ని వేఁగ నేఁగుటకు, నీవిప్పుడు మఱచి నిన్నెఱుఁగనుటి
నగపును నగవును వల్లెలౌ ''ననుడు, ''వగవంగ నవ్వంగ వనిత నీకేల
పరసతుల్ గలియఁగ స్మరుఁ డితం డనఁగ, నరిపిటుల్ పీడపో జాణయనంగఁ
బ్రతికెద నిప్పుడే శ్రీపశేంద్రభోగ, వితతానుభవ సుఖవిభవుండ నైతి
నవియును గాక ముక్కవికలదేవ, సుదతులతోఁ గామసుఖములం బెతిని
గంధర్వ పురసంగరమణులలోన, శుంభ దురాత్మ భాసురకీర్తియుతపు
నిట్టి నీతోడఁ బంచేషు సౌఖ్యంబు, లిట్టలంబుగఁ బొండ నిది యున్నవాఁడ
నెట్లైన విజయుండ నిల నేనకాక, యెల్లింటినరకంబు లేలెక్క నేనా
నాఘన్ను శివునెద్దు యట్లయ్యె నేని, యాపుణ్యఫలమున నమరేంద్రపదవి
గలిగె నేనియు నొండుగా నేలవచ్చు, మలహరునీగియు బిల్వబిలియాగు నె
ఫుల్లవడఁగ నేల ఫల్గాంబుజాత, సల్లలితాస్య! రా శయ్యకు'' ననుఁడు
''దానికి వేగమ తల్లడంబేల యేనొండు నెన కింక నేఁగుదునెట్లు?
నీవు నాసన్నిధి నేఁడుండి యెల్లి, వోసఁ జూడఁగఁజాల భువి కధోగతికి
నామాట విను వజ్రినలకూబరాద, కాముకులను సురానుంబుగ్గైకొనిన''
యమరాంగనాసహస్రావళి నిన్ను, బ్రమదంబు నస్నేహ భావంబుఁ దనర
ననయంబుఁ గామసుఖామృతాపార, వనధిని దేల్చెడివా రుండ నుండు
ననుప చెప్పిన నిదె యర్ధరాత్రంబు. ననియె నాయెడ నొకజాము సుఖంబు
గావున నిత్యసుఖావాప్తి నీకు, గావింతు నమ్ము నిక్క''మ్మని రంభ
యతని నొడఁబఱిచి యతులరుద్రాక్షు, యుతదేహు విమలభస్మోద్ధూళితాంగుఁ
గావించి యీశ్వరాగారంబుఁ జూప, నావాము చెప్పిన యట్ల శ్వేతుండు
ననమాత్మగుడిలోని కనవులు దుడుచు, నెస నల్కుఁ బ్రముగ్గు లొప్పెసగ రచించు
బూవుఁబత్తిరిఁ గోయు వేవేగఁ బఱచి, యాపియద్దం గాంబు లావటఁ దెచ్చు
జలకముల్ సేయుఁ బూజాప్రకాండంబు, లలరించు ధూపదీపాదు లొనర్చు
వలగొని చక్కఁ జాఁగిలఁబడి మ్రొక్కుఁ, జెలఁగుచు కీర్తించు నలిరేఁగి యాడు
నుడుగ కెప్పుడు షోడశోపచారములు, విడువక శివరాత్రి విధి నాచరించు
భావింప నతనిపాప ప్రాప్తిప్రొద్దు, వేవిన క్రియఁ బ్రొద్దువేవుడునచ్చి
నిన్న నిండ్రుండఁప నీపాల రాత్రి, నున్నవానిని జూపు మోరంభయనుచు
గాసిల్లుచున్న యాకాలుమూతలను, డాసి తోడ్కొని పోయి చేసన్నఁజూప

బదకంబు కోయిడి పడఁతి దివ్వెలకు, మదనారికిని దీపమాలిక లెత్తె,
నిదె వచ్చెఁ బులివలె నీ శివరాత్రి, ముదిత కోయిడఁబుచ్చె ముత్తెంపుసరుల,
నెన్నడు చెట్టంగ నున్నాఁడ విట్లు, నన్నయేనాఁటను సతి వెట్టిగలదె,
యెఱుఁగవే యెఱిఁగియు నెఱుఁగనియట్లు, పఱటుఁ బెట్టుచు వచ్చెదుగాక
పోలయఁ గయ్యాము వన్ని గెలుపిచ్చి చెనకెఁ, యలిగినఁ గీష్వడి యలరించి తవిలి
పాసినఁ బైఁబడి పట్టిన సురిక్కి, వేసినవాడలొగ్గి డాసినఁ గవిసి
సొగసిన రతిసేసి చొక్కినఁ జొక్కి, మొగిచినఁ గైకొని మునుకొన్నఁ బాపవి
మాటలు మరగించి మక్కువ నించి, కూటమి మనసిచ్చి కూరిమి సానిపి
కళల పోఁడి మెఱింగి కామంబుసలిపి, వలరసంబున ముంచి బలసఁ జొక్కించి
యలసిన శ్రీమవార్చి యన్నియుఁదెలిపి, మలయుచు మురియుచు మగలంజవోలె
మానాతి వలపించి యేనేఁడు నీవు, గానక తలకిందుగా నడచేవు
డక్కులు లేవలు డంబకంబులును, జొక్కులు నేర్పులు సూటిమాటలును
సంగతి నీకామశాస్త్రముల్ బిడ్డ, కంటికి కాళ్లను గట్టింప నెట్లు
విచ్చేయు నీయాగి వేయును మాకు, వచ్చెఁ దక్కువు చాలు వనిత నీవనుచు
దండించి తర్కించి తనకూతు నొక్క, మండలాధిపుపాల నుంచ బ[illegible]మడును
నంత నిక్కడ మలహణుఁడు గామాగ్నిఁ, గాంతావియోగ దుఃఖం బిన్మడింపఁ
దను ధర్మములు దక్కి తన్విభావంబు, మనమున నెక్కొన మదు బస్మనేత్రి
దవులంబుతోఁ జూచు తలఁపుఁ దలంచుఁ, బవడంపుఁ గెమ్మోవి భావంబుఁ దలఁచు
దాసిన హర్షంచు తాళంబుఁ దలఁచుఁ, జేసిన శృంగారచేష్టలు దలఁచు
జెలఁగుచు నవ్వెడు చెన్నుఁ దలంచు, నలరుచుఁ బలికెడు పలుకుఁ దలంచు
మాటమాటకుఁ జూచు మక్కువఁ దలఁచు, మాటలఁ బిచ్చిచ్చు మధురంబుఁ దలఁచు
సరసంబు లాడెడి జాను దలంచుఁ, గరమొప్పు నెమ్మోము కాంతిఁ దలంచు
సంగదీధితుల యొయ్యారంబుఁ దలఁచుఁ, బొంగారు జారుఁ గొప్పు సొగసుఁ దలఁచుఁ
గలికి కాల్గిన్నుల పొలుపుఁ దలంచుఁ, దెలుపారి మెఱుఁగెక్కు పలువన్నెఁ దలఁచుఁ
గుటిల కుంతలముల కొమరుఁ దలంచు, బెడువగు నెఱివేణి భారంబుఁ దలఁచుఁ
జెన్నుగా నసియాడు నెన్నడుమ్ముఁ దలఁచు, సన్నపు కెక్కిన జఘనంబుఁ దలఁచు
నెఱసిన పాలిండ్ల నిగ్గుఁ దలంచు, నడుగొంగలేని నెయ్యంబుఁ దలంచు
లింగార్చనము సేయు లీలఁదలంచు, జంగమారాధనాసక్తిఁ దలంచు
మేలంబులాడెడి మెలపుఁ దలంచు, నాలింగనాదుల కీలుఁ దలంచు
మఱి మీఁది గతికళామదన సౌఖ్యంబు, దఱిఁదఱి నెండియుఁ దలఁచి తలంచి
యుండఁజాలక యవ్వియోగదుఃఖాగ్ని, మండఁగ ధృతి సిగ్గు మానంబు వదలి
యడలుచు సతిమాట లయినను వినక, తడసిన నిలుచునే తనప్రాణమనుచు
రమణి కేళీమందిరము పంచఁజేరి, కుమతియై సతిచెల్మిఁ గోరుచున్నాఁడను
వెండిలోపలఁ గ్రొత్త మిండనిపోలఁ, గొండొకప్రొద్దుండి కోమలిదల్పు
గ్రిక్కునఁ దెఱచి యక్కాంతపైపెల్లు, వుక్కిలించుటయును నొక్కింత మెఱవ

నెలనాగ గని "యిది యెవ్వరునీరు, మలహణ నీతియే మఱలి యేతేరఁ
దక్కిపోయినమీఁదఁ దనువున జీవి, దక్కినవచ్చునే ధర్మమేయిట్లు
మెఱచినఁగాని యిమ్మెయిఁగానరాని, నెఱసిన చీఁకటి నీయున్కిఁగాన
నమిసితి ( బ్రైఁ బడెనోయొగ్గ" ననుచుఁ, దమకంబునగ్రేల్లఁ దన్నీ నెయ్యిచ్చి
యడలుచు నెపలి బింబాగ్రముంబునకుఁ, దొడుకొని పోయి పైఁబడుడు మల్హణుఁడు
గట్టర్కి నినుఁజూచి కాని ప్రాణంబు, నట్టఁజాలక పచ్చి పడఁతి నిన్గంటి
నాతలంబుగఁ జాలు నంతియకాక, నీతియె పరుఁడుండ నిను నాకుఁగవియ
నింతప్రొద్దుటికి రోయిచ్చినవాఁడు, గాంతుండు గాకంచు గమనంబు సేయు
నెట్టింక నలతు నీ కేనును నీకు, నట్టిప వలపు నాయందు గావునను
దమతల్లి యర్ధంబుఁ దనియంగ నీక, తమకంబెఱుంగదు దర్కించు మనల
నప్పక్తిపరుఁడవు నక్కపీశ్వరుఁడ, పమ్మెప కపితా సమగ్రత మెఱసి
పైచని యిద్దంబుపై మిన్నగంజ, చినఁ బడు నెంతవడి నంతమాత్ర
యిద్ధ సమాధి భూయిష్ఠతఁ దగిలి, శుద్ధత నేకాగ్ర సుఖమనోవృత్తి
హరుఁ బ్రశంసింపుమా పరదుఁ దయ్యోడని. జిర భుక్తిసుఖములు సిద్ధించు మనకు
ననవుడుఁ జనుమెఱు లర్థి నాపిఁప్పు, నను మోపి యాలింగనం బాచరించి
యుండుము నాపెక్కనుడురాజవదన, యొండన నేల నే నొక్కపద్యమున
మాటలాడించెద మనతోడఁ జాత్రిజాటుఁ బన్నున్నగా సుపతి కీర్తింతు
ననవుఁడుసుఖునాఁడు హరుని నివాసమున కేఁగి పరమేశు ముందఱ నిలిచి
నెఱతయు నట్ల తన్నెక్కొని యుండ, మలహరుపై దృష్టులు నిల్పి సన్మతిని
దనరు సద్భక్తి "గాంతా కచప్రచయ", యనుచు నుద్యుక్తుడై హరుమనం బలరఁ
బ్రస్తుతాలంకార బంధుర మగు, విస్తారమతిమల్హణస్తోత్ర మనఁగ
నప్పుడ ముప్పయూఱు శ్లోకములు, సెప్పినంతట మెచ్చి శివుఁడు మల్హణుని
లంజెయు చిలుకను లంజెయతల్లి, లంజ నక్షణము కైలాసంబునకును
బ్రవిమల కనక దివ్యవిమానములను, భువనముల్ పొగడంగ బొందులతోన
కొనిపోవఁజనిరి గావున హితలైన, వనితల బంధులు వినుబ హితంబు
గణుతింప నట్టేల కఱకంను భక్తు, లణకించి పలికిన నదియు హితంబు

" పండితారాధ్య చరిత్రము. "

ఇందలి మల్హణుడు మలహరుని భక్తుడు. ఇతడు వారాంగనాసక్తు డయ్యును శివభక్తి రతుడగుటచే తన యభీష్టమును పరమేశ్వరానుగ్రహమున పొందగలిగెను. శ్వేతుడును వారాంగనాసక్తుడై యనేక పాపముల నాచరించి తుదకు కాలధర్మము చెందెను. అతడొకనాడు తస్కరించి తనవెలయాలికై పూవుల గొనివచ్చుచుండగా అందొకటి మార్గమున పడిపోయెను. అట్లుపోయినదాని నాతడు శివార్పణమని విడు

వగా దానికై యాతనికి రంభాసంభోగము సిద్ధించెను. రంభ యాతనికి బోధించి శివభక్తుని కావించి శివరాత్రి జాగరణము సేయించెను. దానితో నాతడు మోక్షము నందెను. ఈ రెండు కథలును శివభక్తి ప్రధానములగుటచే శైవగ్రంథమగు పండితారాధ్య చరిత్రమున స్థానము సంపాదించుకొన్నవి. అట్టి యీ కథలను శివభక్తపరుడైన ఎఱ్ఱనామాత్యుడు గ్రహించి తనకావ్యమున పెంపొందించి రచించియున్నాడు. ఈ రెండు కథలందును గూడ ఎఱ్ఱనార్యుడు కావించిన మార్పు లంతగా కనుపట్టవు. పుష్పగంధికి మదనసేవకూర్చిన విటుడొక రాజకుమారుడని మూలకథయందుండగా కవి అందులకు బదులు ధనదత్తుడను నొక లుబ్ధవైశ్యకుమారుని కల్పించినాడు. అందలిప్రధాన కథ యంతయు నిందు వచ్చినట్లు ఆతడు సరిచూచెను. ఇతడు కొన్ని చేర్పులు కావించెనని చెప్ప దగును పండితారాధ్య చరిత్రమునందు 164 పంక్తులుగల మల్హణకథను 118 పంక్తులుగల శ్వేతునికథను ఇతడు మూడాశ్వాసములుగల ప్రబంధముగా పెంపొందించి యున్నాడు. అట్లుపెంపొందించుటకై ఇతడు కొన్ని చేర్పులు చేయుటావశ్యకమైనది. మల్హణుని యొక్కయు పుష్పగంధి యొక్కయు బాల్యవర్ణనములును, ధనదత్తుని వృత్తాంతమును, విద్యానిధి సందర్భమును భద్రదత్తాదుల ప్రసంగమును, సుశీలునిపాత్రయు, మల్హణుని కథయందెఱ్ఱనార్యుడు స్వతంత్రించి చేర్చిన యంశములు. శ్వేతుని దురాచారవర్తనమును, శ్వేతుని యమలోకదర్శనమును ఈకవి శ్వేతుని వృత్తాంతమునందు క్రొత్తగా కల్పిన యంశములు. మూలమునకు సంబంధించినంతవరకు ఇతడు మూలమునందలి భావములను భాషను వినియోగించెను. కథాసందర్భమును విస్తరింప చేయుటకు చేసిన ప్రయత్నములో ప్రబంధ లక్షణములైన వర్ణనములను, "ఉదా:—పురవర్ణనము, కాసారవర్ణనము, ఉద్యానవర్ణనము, విరహవర్ణనము, సంభోగవర్ణనము" మున్నగువానిని ఈతడందందు జోడించెను. ఇట్లిందలి చేర్పులు కథావిస్తరణమునకును ప్రబంధ స్వరూపసంపాదనమునకును వినియోగించినవి.

మల్హణ చరిత్రమను నీ కావ్యమునకు భర్త 'చుండికాళుడు.' ఇతడు చుండియను పట్టణము నందలి పరిపాలకునికడ మంత్రిగా నుండెనని

చెప్పబడినది ఇతడు శివభక్తి పరుడు. కాబట్టియే ప్రత్యేకముగ శివభక్తుడైన మల్హణుని కథ రచించి తన కంకితము కావింపవలసినదని స్వయముగా కవిని ప్రార్థించెను. ఈ కృతిభర్త కవివాక్యములలో ధీమంతుడు కీర్తిపరుడు, దానశీలుడు, రసజ్ఞుడు, పరనారీసహోదరుడు. కవి యీతనిని గురించి "కృష్ణరాయ జనకాంతున కీయక దాచినట్టి ఆ, రట్టడిరాణన ప్రౌఢ కవిరాజిత మల్హణకావ్య కన్యకన్" పరిగ్రహింపుమని పలికియున్నాడు. అట్లంటచే కొందరు ఇతడు కృష్ణరాయల సమకాలికుడేమోయని తలంపవచ్చును. నాకుంజూడ నిందలి రచనా పద్ధతిని బట్టియు శబ్దప్రయోగముం బట్టియు నీకావ్యము ఆను కరణశీల మయిన తదనంతర యుగమునందే ప్రభవిల్లినట్లు తోచుచున్నది. ఇందలి కామశాస్త్ర ప్రసంగము కూడ నిది విజయనగరాంధ్ర సామ్రాజ్య విధ్వంసనానంతరమే రచింపబడి యుండుట నిరూపింప నవకాశమిచ్చుచున్నది. ఇంతకు పూర్వపు కావ్యముల శృంగారవర్ణనము లున్నప్పటికి కవులు తాము నిర్లిప్తులై అట్టివర్ణనముల కావించిరేకాని ఈ విజయనగరోత్తర యుగము (Post Vijayanagara Period) నందువలె వాని యందత్యాసక్తి వహించి వర్ణించినట్లు కన్పట్టదు. కాబట్టియు నిది కృష్ణరాయని కాలమున రచింప బడినది కాదని తోచుచున్నది. మరి 'కృష్ణరాయ జనకాంతున కీయక దాచినట్టి' అనుట కర్థమిట్లు చెప్పవచ్చును. ఈ కవి కవితాహంకృతి కలవాడు. 'శివభక్తనిధివి మంత్రివి, కవితాభిజ్ఞుడవు' అని కృతిభర్త తన్ను సంబోధించి పలికినాడని చెప్పుటవల్ల నిజముగా తాను మహాకవియని తానువిశ్వసించి యుండుట తెల్లమగుచున్నది. తాను కృష్ణరాయల కాలములో లేడుకాని ఉండినచో కవిత్వ కళాపోషకుడగు సమ్రాట్ఛక్రవర్తి ఘనమహారాజదానిని తప్పక స్వీకరించి యుండునని అతని తాత్పర్యము. 'దాచుట'యనగా 'గడవపెట్టుట,' 'తప్పించుట' యని యర్థము చెప్పదగును. ఈపద్ధతిని చూచినచో ఈతడు కృష్ణరాయల సమకాలికుడని చెప్పునావశ్యకము కన్పట్టదు. ఇందలి కృష్ణరాయ జనకాంతుడన 'నంద్యాల కృష్ణవిభుడని' చెప్పవచ్చునేమో విచార్యము. ఎట్లునను ఇందలి చుండికాళుడు పదునారవ శతాబ్దమునకు చెందినవాడు మాత్రము

కాదు. 17 వశతాబ్దమున నుండియుండవచ్చును. ఇతడు నియోగిబ్రాహ్మణుడు సోమాంబారామయామాత్యుల పుత్త్రుడు. విస్సమాంబాపతి. ఇతడు మంచి సంపన్నుడు బంధుప్రియుడు ధైర్యశాలి. చుండియను నది నెల్లూరు మండలము నందలి యొకచిన్న సంస్థానము. కాళనమంత్రి ఆ సంస్థానాధిపతి కడ సంస్థానకార్యములను చక్కబెట్టుటకు నియోగింప బడిన ప్రధానాధికారియై యుండెను. ఇతడు తనకుగల అధికారము చేతను, ఐశ్వర్యముచేతను, రసజ్ఞతచేతను కవిపోషకుడై యీ మల్హణ చరిత్ర కృతినంది యున్నాడు.

మల్హణ చరిత్రమును నీ కావ్యమును రచించిన కవి ఎల్లనార్యుడు. ఇతడు నియోగి బ్రాహ్మణుడు, శివభక్తిపరుడు. కృతిపతియగు కాళనమంత్రికి బంధువు. ఎడపాటి పురాధిపుడనుటచే, ఎడపాటి గ్రామాధికారి అనగా కరణమై యుండవచ్చును. ఇతడు సోమయామాత్యుని కుమారుడు. కౌండిన్యసగోత్రుడు. ప్రబంధరత్నావళి యందు ఎల్లనార్యు నింటిపేరు పెదపాటి వారని కలదు. మల్హణ చరిత్రమున కృతిపతి ఇతనిని ఎడపాటి పురాధిప! ఎల్లనార్య! అని సంబోధించి యున్నాడు. దానినిబట్టి ఈతని ఇంటిపేరు ఎడపాటివారని ఊహింప నవకాశమున్నది. ఆశ్వాసాంతగద్యమున కూడ ఎడపాటి అనియే కన్పట్టుచున్నది. కాబట్టియు ఇతని ఇంటిపేరు ఎడపాటివారని చెప్పుట కవకాశము కలుగుచున్నది. ప్రబంధ రత్నావళీ సంకలనకారుడు అగు పెదపాటి జగన్నాధకవి కృష్ణామండల మందలి ఏలూరునకు చేరువనున్న పెదపాడునకు చెందిన వాడు. అతడు బహుశః ఈయెల్లనార్యునకు దగ్గర వాడయియుండి ఆతనియింటిపేరు పెదపాటి వారని వ్రాసి యుండును. అందువలన ఎల్లనార్యు నింటిపేరు పెదపాటివారే అనియు ఇతడు కాళనమంత్రి బంధుత్వముచే అతని అధికారములోనున్న ఏడపాడు అని గ్రామమున కధికారియయ్యె ననియు తలంపనగును. కృతిభర్త ఎల్లనార్యునితోడి ప్రసంగమున అతని ఎడపాటి పురాధిపత్యమును ప్రశంసించుట తానతనికి మున్ను కావించిన యుపకారమును జ్ఞాపకము చేయుటయే యగును. అట్లుకానిచో కాళనమంత్రి బంధుప్రియత్వమునకు

నిదర్శనము కనుపట్టదు. ఎఱ్ఱనార్యు నింటిపేరు పెదపాటి వారై యుండినను, ఆతడెడపాటి పురాధిపత్యమును వహించుట కెట్టి విరోధమును కలుగదు. చుండికాళ్ళయ్యైనంతనే కాళ్ళసమంత్రి యింటిపేరు చుండివారనముగదా! అట్లు ఎఱ్ఱనార్యుని యింటిపేరు పెదపాటివారనియు అతడు కృష్ణా మండలమునకు చెందిన వాడనియు చెప్పనగును.

ఈ కవి శివభక్తుడు. శైవమత గ్రంథములను ఈతడు బాగుగా చదివినవాడు. ముఖ్యముగ పాల్కురికి సోమనాథుని కృతులను బాగుగా చదివినవాడు. ఇతడు కావించిన పూర్వకవిస్తుతులలో మల్హణ, కాళిదాస, మయూర, మాఘ దండ్యాదులను సంస్కృతంబునను; నన్నయ తిక్కనా ర్యులను, వేమన పోతనాదులను తెలుగునను ముఖ్యముగా పేర్కొనినాడు. ఆయా పూర్వకవుల గ్రంథములను ఈతడు బాగుగా పఠించి యుండెననియు తదను రూపముగు పాండిత్యమును రసజ్ఞతయు ఇతని కలవడినవని చెప్పవచ్చును. ఈతడు నాచనసోముని, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని పేర్కొనియున్నాడు. కాని శ్రీనాథుని పేరును ప్రశంసించి యుండలేదు. ఇతడనేక సందర్భముల పూర్వకవులను అనుకరించిన పద్యములున్నవి. అట్టిచో వారిని ప్రశంసింపక ఈతడు వదలి పెట్టుట అంతయుక్తముగా కన్పట్టదు. ప్రబంధరత్నావళి వలన ఈతడు 'కుమారనైషధ' మను కావ్యమును గూడ రచించినట్లు తెలియుచున్నది. కాని మరొకకావ్యమును రచించినట్లు మల్హణచరిత్రలో చెప్పియుండక పోవుటచేతను, ఇందలి పద్యములకంటె కుమారనైషధ మందలి పద్యములు ఎక్కువ ప్రౌఢముగా నుండుటచేతను, మల్హణచరిత్ర తొలికృతియనియు, కుమారనైషధ మనంతర రచన మనియు చెప్పవలను పడుచున్నది.

ఈరెండు కావ్యము లందును ఎఱ్ఱనార్యుడు తనకు పూర్వకవుల యెడగల గౌరవమును వారి వారి రచనా పద్ధతులందు తనకుగల అనురక్తియు ఆయాపద్ధతుల తానుకూడ చూపింపగలడను నహంకారమును ప్రదర్శించియున్నాడు. ఇతడు ముఖ్యముగా అనుకరించినది 'కవిసార్వభౌముని' అని చెప్పదగును. శ్రీనాథునివద్దనే ఈతడు సీసపద్యమును నడిపెను. సీసపద్యము ఛందస్సునకు కుదురు కుదిర్చినవాడు శ్రీనాథుడు.

ఇతని సీసమునందు ఏపాదమునకు ఆపాదము సమవిభక్తమై ఏగణమున కాగణము విడదీయ ననువుపడి పద్యగతియందు లయకలిగి శ్రవణపేయముగా నుండును. ఇట్లు కూర్చిన నాలుగు సీసపాదముల తుదిని అదేపద్ధతిని రచింపబడిన ఒక గీతపద్యమును చేర్చుట శ్రీనాథుని పద్ధతి. శ్రీనాథుని చేతిలో సీసము పలుపోకడలు పోయినది. ఎన్ని పోకడలు పోయినను సంగీత గతులు సన్నగిల్లక యేపోయినది. ఆరచనాపద్ధతియందలి సొబగు చూచి అనంతర కవులు అనేకులు దాని ననుకరించిరి. అట్లనుకరించిన వారిలో పినవీరభద్రుడు, పెద్దన, భట్టుమూర్తి మున్నగువారు ముఖ్యులు. ఎఱ్ఱనార్యుడును ఈ శ్రీనాథుని సీసమునే తఱుచుగా నవలంభించెను. ఎఱ్ఱనార్యుడు కుమారనైషధమును రచించుటయందుకూడ అతని కవితాహంకృతి తేటపడుచున్నది. శ్రీనాథుడు శృంగారనైషధమును వ్రాయగా నీతడు కుమారనైషధమును వ్రాసెను. అందును ఇందును కూడ నిషధరాజచరిత్రమే వర్ణింపబడుట ఇందలి విశేషము.

ఎఱ్ఱనార్యుని అనుకరణముల క్రింది యుదాహరణముల గమనింపదగును.

సీ. లావణ్య రేఖా విలాసలోలాకళా, కాసితసూన శరాసనుండు
కుంభినీవహన విజృంభణోత్తంభ సంభావితా శాంత దంతావళుండు
దారార్థ దానాంబు ధారాతియాచకజాల, దుర్గమ మర్యాద కర్దముండు
నీహార సురవాహినీ హారనారద శారద నీరదస్వచ్ఛ యశుడు
గీ. వినుతి సేయంగ దనుజదిగ్విజయలటహ పటహనిస్వన నిర్ఘాత పటలచటుల
ఘోర నిర్ఘోష వినమిత కుమత విమత కులకరిస్య స్తవిస్ఫూర్తి నలుడు నలుడు.

కుమారనైషధము.

సీ. తపనీయ దండైక ధవళాత పత్రితో ద్దండ తేజః కీర్తి మండలుండు.
నిర్మల నిజకథా నిమిష కల్లోలినీ క్షాళితాఖిల జగత్కల్మషుండు,
వితత నవ్యాయద్వీప నానాజయ శ్రీవధూటీ సమాశ్లిష్ట భుజుడు,
నిఖిల విద్యాపటప్రవృత్త రంగస్థలాయిత నాయమాన జిహ్వాస్థలుండు,
గీ. ప్రస్తుతింపంగఁదగు సముద్భట కఠోర ఘటుల గుణటంక్రియా ఘనస్తనిత ఘోష
చాపనీరద భవ శరాసారశమిత బలవదహిత తేజోదవానలుడు నలుడు.

శృం. నై — ౧. ఆ. ౭౬. ప.

గీ. మారుతూలికరీతి జెన్నారునారు కంబువునకంటె మహిమ వెగ్గలము గలము
వజ్రములకును లేదు పల్వరుస వరుస యనగనుతికెక్కె రామ లోకాభిరామ
మల్హణచరిత్ర

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి
గీ. దేవదేవుని జింతించు దినము దినము చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి
భాగవతము.

కుమారసైషధమునందలి "మన్మథ" (84 ప. 26 పే. ప్రబంధరత్నావళి) ఎట్టినార్యుని వర్ణనాశక్తికి చూపదగ్గ ఉదాహరణము. 85 ప శృంగారసైషధమందలి. "తపనీయ దండైక" అను పద్యమునకు అనుకరణము. మల్హణ 6 పే—2వ. పద్యము నందలి 'తనదాన విస్ఫూర్తి ధనరాజ సంతాన చింతామణిశ్రేణి సిగ్గుపరుప' అన్నది 'చింతారత్న జీమూతసురభుల సిగ్గుపరుప అను దానికనుకరణము.

ఇట్టి మహాప్రధాన పరమేశ్వరమూర్తివి అన్నదానియందు, 'ఇట్టి పదంబు గాంచి పరమేశ్వరునింగృతినాథుచేసి' అనుదాని అనుకరణము కన్పట్టును. విపరీత ప్రతిబంధ మోక్షణవిధుల్ వేమారుగావించుచున్' అనుచో 'విపరీత ప్రతిపత్తి ధీనహితముల్ వింతైన శాస్త్రార్థముల్? అన్నవాసనయు కన్పట్టును. అటకాంచెన్ ధరణీసురుండు నవసంధ్యావేళ అనుపద్యమున (76 పే. 4. పద్యం) అటచనికాంచె భూసురుడను దాని కనుకరణము. 'కాయసిద్ధికి సిద్ధసంఘంబులెల్ల కూర్చు సిద్ధరసంబుల గొటికేయనగ' (77 పే. ఎత్తుగీతి.) అన్నయుత్ప్రేక్ష మనుచరిత్రమునుండి ఎరువు తెచ్చుకొన్నది. ఈపద్యమునందలి చంద్రోదయ వర్ణనము పారి

జాతాపహరణము 2 వ ఆశ్వాసమందలి ఉత్ప్రేక్షల ననుకరించినది. ఈ ప్రకారముగ ఎఱ్ఱనార్యుడు తనకుగల పూర్వకవి గౌరవమును కొంత వాగ్రూపముగను కొంత అనుకరణ రూపముగను వెల్లడించియున్నాడు.

ఎఱ్ఱనార్యుని వర్ణనాశక్తి క్రింది యుదాహరణములు గమనింప దగును. ఊర్వశిని లుబ్ధతకు—

సీ. దైవాలకును రిత్తదండాలు గిండాలు గాని యొన్నడు నొక కాసునీయ
కవిగాయకులువచ్చి గణుతించి వేడిన పసలిపోవుటెకాని పైకమీయ
చుట్టాలకును వట్టిసుద్దులు దుద్దులుగాని యెన్నడును దగ్గరగనీయ
పైత్రోవ వచ్చిన పరదేసి దొరదేసి మోసపుచ్చుటెగాని గాసమీయ
గీ. పట్టుకొని బందికాండ్రను బాధపెట్ట పెంచులేచూప నొక బలుపీసమైన
బ్రహ్మరాక్షసిశాకిని బ్రతిదినంబు కూతలేకాని ముద్దెడు కూడుపెట్ట.
సీ. మునుపు దొంగలకు బోయిన గొడ్డులేకాని తగలి బాపనులకు గోదానమీయ
కొఱమాలి ముఱిగిన కూష్మాండములెకాని దాక్షిణ్య మొదపంగ దానమీయ
పెనుకొట్టు పెసలు ముక్కిన బియ్యమేకాని యంగళ్ళ నమ్మింతు ననువు లెఱిగి
వడ్డికాసులుకూర్చి వడ్డి కవిరెయె యిచ్చి పొరుగింట్లంకంక నేపొద్దుబోదు
గీ. ఈగకై బలి యెన్నడు నీయకుండు పాముకై బలిపెట్టను ప్రతిభతోడ
కదిసి యెంగిలి చేతను గాకినేయ నెరయ నాజాడ నెవ్వరు నెఱుగగోయి.

మల్హాణ చరిత్ర.

శయ్యాగృహ వర్ణనమునకు—

సీ. పగడంపుగంబాల పచ్చటోవరియును నపరంజికాళంజి యాలరు బొన్ను
బంగారు పకినెలపట్టె మంచంబును వజ్రాల నునుజాల వల్లికయును
కుంకుమ తలగడ గొజ్జంగి పూదెబల్ తరమైన చంద్రకాంతంపుగండి
చౌసీతిరతముల సవరని మేల్కట్లు దీపించు మాణిక్య దీపకళిక
గీ. పొసగ కస్తూరివేది కప్పురపు సురటి నిలువుటద్దంబు రత్నంపు నెత్తుపలక
తళుకుదంతపు బావలు కలికి చిలుక గలిగి యొప్పారు చవిక లోపలికి నపుడు.

మల్హాణ చరిత్ర.

సూర్యోదయ వర్ణనమునకు—

సీ. ఇంద్రు డంబుధిపైబడి యుస్సుగొల్పనివెట్టి కరగించు కరువు ముఖంబనంగ
సైరావతంబున కలిక భాగంబున బెట్టిన జేగురు బొట్టనంగ
నెఱితనంబున విధి నిర్మించి మించిన కరమొప్పు పసిడిపళ్లెర మనంగ
ప్రాగ్వధూమణిహస్త పంకజంబున గల పొలుపాను ముంకెవ పూవనంగ

గీ. నుదయగిరిమీద నప్సరోయువతు లిడిన నిద్దమైయొప్పు కుంకుమ ముద్దయనగ
ప్రాగ్వధూమణి సొమ్ముల బరణియనగ తరణి యుదయించె సుప్రభాసరణి మెఱయ.

మల్హణచరిత్ర

శివసాక్షాత్కార వర్ణనమునకు—

సీ. జడముడి దొలకాడు జాహ్నవీనదితోడ మేసగమున నున్న మెలతతోడ
ప్రక్కలం బ్రణుతించు ప్రమథ వర్గముతోడ జయపెట్టు దేవతా సమితితోడ
పొగడెడు బ్రహ్మల పునుక పేరుల్తోడ నటన మిన్నందిన నందితోడ
గాలిచే నల్లన గదలు సొమ్ములతోడ పులితోలుపట్టు దువ్వలుతోడ
గీ. పొలుపు మిగిలిన పలుపు విభూతితోడ మహిమ దలుకొత్తు రుద్రాక్షమాలతోడ
కలిమ్మిన్నాడల చంద్రఖండమ్ముతోడ నమరి సర్వేశ్వరుండు ప్రత్యక్షమయ్యె.

మల్హణచరిత్ర.

చంద్రోదయ వర్ణనమునకు—

సీ. మన్మథు దివ్యాగమమున కోంకారంబు భూతేశు నొసల ఫుల్లపుండ
అల్పశృంగారి రేఖాగ్రసూచిక యధికతమో దంతి కంకుశంబు
విరహిణీ జనమర్మ విచ్ఛేద కర్తరి యంబరక్రోడ దంష్ట్రాంకురంబు
తారకామౌక్తిక తతికి సంచితశుక్తి తగునంబురాశికి ముత్యాలజోడు
గీ. మారుపట్టాభిషేకాఖ్య వారకుంభి చిత్తజుని కోటబగ్గ పంచనపుగుండు
నానానాటి కభివృద్ధి నారుకొనిన చంద్రుడుదయించె కాంతినిస్తంద్రుడగుచు.

కుమార నైషధము.

ఈ కావ్యమున ఎఱ్ఱనార్యుడనేక సందర్భముల చక్కని నీతిపద్యములను వ్రాసియున్నాడు. ఈ పద్యములు ఎల్లవారికిని ఎల్లకాలము చదువ యోగ్యములైనవని చెప్పదగినవి. పిల్లలను చూచుపద్ధతికి (16వ పేజీలో 3వ పద్యం) స్త్రీవిద్య ఆవశ్యకమనుటకు (18పే. 2. ప) పరకాంతా గమనము కూడదనుటకు (50 న పుటయందలి 5,6, పద్యములు) పరస్త్రీ సంగతి పరధనాపహరణమువల్ల లాభనష్టముల తెల్పుటకు (51పే. 1ప.) దాసీసంగమము కూడదనుటకు (51పే. 2ప.) విషయ పరత్వము కూడదనుటకు (52పే. 2ప) లోభము కూడదనుటకు (59పే. 4ప.) విద్యలలోనెల్ల కవిత్వమెక్కువనుటకు (94పే. 4ప.) ఇట్లిందలి నీతిపద్యములు రమణీయములై కవికిగల సదసద్వివేచనా జ్ఞానమును కావ్యముఖమున పాఠకున కాతడందిచ్చు సందేశమును విస్పష్టమగుచున్నవి.

ఎఱ్ఱనార్యుని కవిత్వమందు చక్కని తెలుగు పలుకుబడి కలదు. మంచి లోకోక్తులు కలవు. ఇందలి తెలుగు పలుకుబడి చాలవరకు పండితారాధ్య చరిత్రములోనిది. మరికొంత తత్కాల సంఘవ్యవహారము లోనిది. ఇందలి లోకోక్తులు రమణీయములైనవి. విభీషణ పట్టము, శ్రీరామరక్ష, సుగ్రీవునాజ్ఞ, పున్నరకాత్త్రాయతి, అపుత్రస్యనాస్తి సుగతి, రాజు మగడైన నేలాగాజుంకడియంబు, ఈకుండిన లంజ పిలువదు, కలివ్రోసిన ఉట్లవంక కనుగొనుట, గోరుచుట్టుమీద నడరగ రోకంటిపోటు, శుష్కములు బద్ధములు కావు, చిక్కనగమైతివి, నెత్తితిరిగ బోకలి తలజుట్టు చెరువు మూయమూకుడు గలదే? ఎక్కడు వానికిన్ కుటుచయేనుగు ఈ మొదలైనవి ఉక్తివాల్లభ్యము గల ఇతని లోకోక్తుల కుదాహరణములు.

ఎఱ్ఱనార్యుడనుకరణశీలుడనియు దేశ్యపద బాహుళ్య రచనా ధురంధరుడనియు వెనుకనే చెప్పితిమి. మూలగ్రంధమగు పండితారాధ్య చరిత్రమునుండి యితడిందలి రెండుకథలును వాడుకచేయుటలో ఈ గుణములు ప్రకాశించిన తెఱంగును పరిశీలింప దగియున్నది.

వేశ్యమాత వర్ణనము

ద్వి. నెట్టన నేలకు నింగికి సూత్రపట్ట, మోకాళ్లును బట్టతలలును
ముడివెట్ట, తననీడ గడవంగపార వడినెండ మావులకడ గాళ్లుగట్ట
పాయక రెండుగా పారెడునీరు వేయంగ, పులిజున్ను కోయనియమ్మ
రానారయొలువ, చటాగ్రితిపై కుంక ఏనుంగు పురుడోమ, ఇసుక
తాళ్లేన్న,
లలిగొన దిశలు తాలములు వాయింప, చెలగుచు బోకటి చిగురులు
గోయ,
కలివెన్నపుచ్చ, కొండలు దొంతివేర్ప, ఇఱుమంచు కుంచానగొలువ,
తేపగలు

సేయ, ఆకసమున చిత్రరూపములు వ్రాయ, వాయువుపట్ట వడగండ గుళ్లు గట్ట, వెన్నెల ప్రోవుగా సేయ చచ్చి పుట్ట, అప్పుడ నేర్చుబుద్ధుల ప్రోక

(పండితారాధ్యచరిత్ర 1పు.)

సీ. నేలయు నింగియు వాలముల్ వాయింప నెండమావులబట్ట బండతేలయు
ప్రోకాలు ముడివేయ రోకట జిగురులు గోయ జట్టాతపై గ్రుంగనిడువ
కేక చిత్రము వ్రాయ నాకాశమున దాపగమునీద నుంచుకుచముల కొలువ
నేనుంగు పురుషోమశకానారగొనగాలి గంటిపై నిసుమునగట్టు ద్రాళ్ల,
గీ. నీర నడుము దెంపనేల దున్నుండిచే నప్పగలియు ద్రచ్చివెన్న గొనగ
నిజము నేర్పుగలిగి కందువ మానైడై కత్తిగంటువియును యత్తగంతు.

కుమార సంభవము. ఉత్తరభాగం. నన్నెచోడుడు.

సీ. నేలకు నింగికి నెఱయదాపలునెట్టు చెలరేగి రోకట చిగురుగోయు
గడు బట్టతలలు మోకాళ్లను ముడివేయు గొనరక వడగండ్ల గుళ్లుగట్టు
బూని క్రమై సంగళ్ళ బులిఋన్నులమ్మించు నయమున జటాగ్రిత నారదీయు
నొండొండ గొండలుగుండుగా దాకించు వదలక నడురేయి బగలుసేయు
గీ. రూఢమెఱయంగ నిసుమున ద్రాడు బేను లెక్కసేయక చుక్కల లెక్కబెట్టు
గాలి నొడిగట్టు పంచుగుంచాల గొలుచు మిగిన మాయాకళాధాన మదనసేన

(మల్హాణచరిత్ర 2 ఆ.)

ఈకవికి కామశాస్త్రము, సంగీతశాస్త్రము, నాట్యశాస్త్రము మున్నగువానియందు చక్కని పరిజ్ఞానమున్నట్లు నిరూపించవచ్చును. ఇతని సంగీతశాస్త్రమునకు (39 వ పే) సీసమును నాట్యపరిజ్ఞానమునకు 19, (40వ పే) సీసములును ఉదాహరణములు. కామశాస్త్ర పరిజ్ఞానమునకు 43వ పేజీయందలి సీసమును చూపవచ్చును. ఇతనికి వేశ్యలతోడను పల్లవులతోడను యెక్కువ సంపర్కమున్నట్లు కన్పట్టును. వేశ్యమాత ప్రభావవర్ణనమును వేశ్యాధర్మ ప్రపంచనంబును పల్లవుల కుతూహలపు ప్రస్తావనయును చేసినట్ల వ్యక్తమైనది. దుర్వృత్తుని లుబ్ధతె అభివర్ణించుపట్టున తన కట్టివారియెడ గల అసహ్యము వెల్లడిచేసియున్నాడు. మరియు నిందు ధనదత్తుని వర్ణనమున కవికి వైశ్యులయెడగల విమనస్కతను వెల్లడించియున్నాడు. ఇందలి ధనదత్తుని కేవల లుబ్ధునిగా చిత్రించుటయేగాక

వానిని పిశాచమువలెను, మర్కటమువలెను, ఎనుబోతువలెను, వెఱ్ఱిగొల్లని వలెను, అశుద్ధపదార్థమువలెను పుష్పగంధి చూచినదని వ్రాయుటచే నైశ్యకులమునెడ కవికిగల అసహ్యాభావము వెల్లడియగుచున్నది.

ఇంతియేకాక ధనదత్తుడు తనయెడల నేమాత్రము మక్కువలేని పుష్పగంధిని కాంక్షించుటయు, ఆమెయెడ తాను చనవుతీసికొన ప్రయత్నించుటయు ఆమెతో శృంగారచేష్టలు చేయుటయు మిక్కిలి అసభ్యమును అసంగతమును అయినవి. కవి ఇట్టిసందర్భమును వర్ణించుటవలన ఇట్టి అననురూపసాంగత్యమాతని కిష్టములేదని వెల్లడియగుచున్నది. ధనదత్తుడంతటితో నాగక పుష్పగంధిని నిదురపోనీడు, మేల్కొననీడు. ఇంత కన్న దౌర్జన్యముండగలదా! ఇట్టి రచనమువలన వేశ్యలందు నీతియు నుత్తమత్వమునుగలవారి మనఃక్లేశమునెడ సానుభూతి చూపుచున్నాడని తప్పక చెప్పనొప్పును. ఇప్పట్టున కవి అనురక్తి కలవారలకే సంసర్గముండదగునని ప్రతిపాదించుట గమనింపదగును. "వనితనెడ" (32వ పే. 2 ప.) నందు మల్హణునిచేత సృష్టియందలి లోపమును విమర్శింపించినాడు. ఇట్లగుట ఈకవి పరస్పరానురాగము కూటమికావశ్యకమనియు బలాత్కారము రసాభాసహేతువనియు కావ్యముఖమున ప్రతిపాదించినాడు.

ఈకావ్యమున పుష్పగంధి సంభోగము వర్ణించబడినది. అదియు చౌర్యసురతము. ఇది ప్రస్తుతాభిరుచికి సరిపడనిది. ఇట్లే మరొక సందర్భముకలదు. మల్హణునకు, పుష్పగంధికిని విద్యాదాతయగు విద్యానిధి కడకు భద్రగుప్తాదులు వచ్చుటయు అంతకుపూర్వమే మల్హణునితో పుష్పగంధినిగూర్చి ప్రసంగించుచుండి ఆకస్మికగా వచ్చినవారిని కామశాస్త్రప్రసంగములోనికి దించుటయు నిందు వర్ణింపబడినది. ఆపాంచాలాదులు స్త్రీ పురుషుల జాతివిభేదంబులును తత్తదనుకూలవర్తనంబులును శృంగారనాయికా లక్షణంబులును, సంభోగ శృంగారపద్ధతియు వేశ్యాసంగమము పరస్త్రీసంగమము విధవాసంగమము, దాసీసంగమము మున్నగు వానినిగూర్చి ప్రసంగింతురు. ఇదియంతయు మన యభిరుచికి సరిపడనిది. ఇట్టి యంశములు కావ్యరూపమున చెప్పిననేకాని తెలియవన్న బాధలేదు.

అందును ఇందలి పాంచాలాదులకు మరొక ప్రసక్తి లేదు. కేవల కామశా స్త్రగోష్ఠికై ఆపాత్రిలనుకల్పించి కని తనకుగల విషయాసక్తిని ప్రకటించె నని చెప్పుట ధర్మేతరముకానేరదు. మానవుడు విషయపరుడగుటకుకూడ ధర్మమేఅయినప్పటికిని దానికిని స్థలకాలములు వలయును. అంతేకాక విద్యానిధి మల్హణునకును పుష్పగంధికిని గురువు. ఇట్టి కామవ్యాపారమున మల్హణుడు విద్యానిధికడకు వచ్చి సలహాఅడుగుట అయుక్తము. అతడు యౌవన ప్రాదుర్భావముకల ఈనాయికానాయకులకంటె వయోధికుడు,అనుభవశాలి, పండితుడు. అట్టివాడు పాంచాలాదులతో నిత్యగోష్ఠి నెరపుననుటకాని ఈ కామవ్యాపారమున మల్హణుని ప్రతిబోధింపవారిని ప్రేరేచుటకాని అయుక్తమును దేశకాల పాత్రౌచిత్య విరుద్ధమును అని చెప్పదగును.

మల్హణ చరిత్రము ఎఱ్ఱనార్యుని కావ్యములలో మొట్ట మొదటిదై యుండదగును. అంతకు ముందేదేని కావ్యమును రచించి యుండిన పక్షమున నతడిట్టి వానిని తప్పక పేర్కొనును. అట్లు పేర్కొనుటయు అతని అహంకార ప్రవృత్తికి సహజమైనది. ఇందుగల కామశాస్త్ర ప్రశంసవల్లను ఇతడంతకు పూర్వము కావ్యరచనానుభవము లేనివాడని నిరూపించ వచ్చును. తొలికృతియగుట నిందుకొన్ని దోషములును దొరలినవి. ఇందుకొన్ని సంధి దోషములును కలవు. ముఖ్యముగా త్వార్థక ఇకారసంధి. ఉదాహరణమునకు:— పుక్కిలించుమియుట,కూడుండు, (కూడి యుండనుటకు) మున్నగునవి. గణభంగమునకు 25వ పుట యందలి కడపటి పంక్తిలో భూరికృపా (రి)గురువు కావింప బడినది. యతిభంగమునకు, "ముందర నుయి వెనుక బొంద మొగి ననుటయ్యెన్" మున్నగువాని నుదాహరణాలుగ చూపవచ్చును. మొత్తమువిూద నీకావ్యము నందలి ధారాశుద్ధి రమణీయమయినది. దానికిగూడ ఈకవికి ఆదర్శమగు శ్రీనాథుని ధారయేమూలకారణము. 'శ్రీనాథుని పదప్రసిద్ధ ధారాశుద్ధి' నారాధించి అనుకరించుటచేత ఇతనికి కుంటువడని కవిత్వధారకలిగినది. ఇతని కవిత్వమున ధారాశుద్ధికితోడు 'లిరిక్కు' స్వభావమును ప్రస్ఫుటించినది. 84 వ. పేజీయందును 85 వ....ను 83, వ పే...ని పద్యములు ఇట్టి 'లిరిక్కు' పద్ధతిని వ్రాసినవే. దీనినిబట్టి యీకవికి పాత్రికలననుు

సంవాదము కూర్పుకంటె ఏదోనొక విషయముపైన నుద్దేశించి పద్యము వ్రాయుటయందు సామర్థ్యమున్నదని చెప్పవచ్చును. అంతియేకాక ఒక కృతి భర్తను అతని యభిరుచికే అలవాటుపడిన తదనుయాయులను మెప్పించుటకై వ్రాయబడు కావ్యమగుటచే ఇందలి దోషములకు కవి యొంతయేని అబాధ్యత కలవాడనియు చెప్పనగును. ఇంకను ఈవాక్యమున గల గుణదోషములను రసజ్ఞులగు పాఠకులే విమర్శించి చూచుకొందురు గాక !!!

చోడవరపు జానకిరామయ్య.
ఎం. ఏ. ఉభయ భాషాప్రవీణ
పి. ఓ. యల్.

బందరు
9–9–40

*
* *

శ్రీరస్తు.



# మల్హాణ చరిత్ర.



ప్రథమాశ్వాసము.

"శ్రీ లలితంబు సానునయ
శీతగుణంబును జారుపాదరే
ఖాలసనంబుఁ జన్నుఁగవ
గట్టితనంబు నితంబశోభయుఁ
బోలును గౌరి తండ్రిబడిఁ
బుట్టిన" దంచు హాశించు శంభుఁ డే
వేళను జుండి కాళునకు
వేడుక నీవుతఁ గామితార్థముల్.

ఉ. శ్రీరమణీమనోహరుఁ డ♦శేష సురస్తవనీయమూర్తి శృం
గారరసాధినాయకుఁడు ♦ కామినులం బదియాఱువేల ని
చ్చారతి నేలుకృష్ణుఁ డని♦శంబు సుఖాఢ్యునిఁజేయుఁ గామినీ
మారునిఁ జుండిరామయకు♦మారునిఁ గాళసమంత్రి శేఖరున్.

ఉ. "అంబుజసూతి, నీవు భువ♦నావలిఁ బ్రోచెదవు నాదు వీణ భా
వంబున నాలపించు" మని ♦ వాణి హాసం బొనరింపఁ బోలు ని
త్యంబును సామగానముల♦నభ్యసనం బొనరించుధాత నె
య్యంబునఁ జండికాళనఁ జి♦రాయురుపేతునిఁ జేయుఁ గావుతన్.

ఉ. నిండి మహామునీశ్వరులు ♦ నిర్జరకోటులుఁ జూచుచుండఁగాఁ
దుండమునందు నందుగొని♦తోరపుఁ బండులుఁ బిండివంటలున్
దండిగఁదించు మించి తలి♦దండ్రులకున్ బ్రమదంబుఁ జేయు వే
దండముఖుండు చండిపుర♦ధామునిఁ గాళన ధన్యుఁ జేయుతన్.

సీ. దంతకాంతినితాంత♦ధాళధళ్యములైన
ధౌతవస్త్రములు ము♦త్యాలయిండ్లు
కలశాబ్ధిఁ బుట్టి పు♦ష్కరమునఁ జూపట్టు
మొలకచుక్కలఱేఁడు ♦ మొగలిఱేకు
వేదశాస్త్ర పురాణ♦విద్యల కొరగల్గు
వలచేతఁ బొలుపారు ♦ కలికిచిలుక
అతులితరత్నకీ♦లిత భాసురంబైన
బంగారు కిన్నెర ♦ పలుకుఁదోడు

తే. గీ. ప్రణవవర్ణంబు దానుండు ♦ భద్రపీఠ
గాఁగ నింపారు నజురాణి ♦ కమలపాణి
వాణి కృపసేయు నెపుడు వా♦గ్వైభవంబు
నెలమితోఁ జండికాళమం♦త్రీశ్వరునకు.

సీ. కలశాంబురాశిలో♦పల బుట్టి యే దేవి
వాసుదేవుని రాణి♦వాసమయ్యె
వనజాక్షు మెప్పించి ♦ వక్షస్థలంబున
నేదేవి నెలకొని ♦ మోదమందె
లోకమాత యనంగ ♦ లోకత్రయంబునఁ

నఖిల సంపదలు నిం♦ద్రాదుల కేదేవి
కడకంటిచూపునఁ ♦ గలుగుచుండు
తే. గీ. వికసితాంభోజ మేదేవి ♦ వీడుపట్టు
అట్టి శ్రీ దేవి కరుణ జే♦పట్టి యొసఁగు
భాగ్య సౌభాగ్య వైభవ♦ప్రాభవములు
నెల్లపుడుఁ జండికాళ మం♦త్రీశ్వరునకు..

మ. "తెలియంగా నట నీదుమస్తకమునం♦దేకాదు భావింప నీ
నిలువెల్లన్ నట"లంచు నాత్మవిభు నెం♦తే నేర్పుతో నవ్వ నె
చ్చెలి కంతంతకుఁ గన్ను సన్నఁ బ్రమద♦శ్రీనించు గౌరీవధూ
తిలకం బీవుతఁ జండి కాళునకుఁ బ్రీ♦తిన్ భాగ్యసౌభాగ్యముల్

ఉ. శంభుజటాటవీతటవి♦శంకట సింధుతలప్రఘుంఘుమా
రంభవిజృంభితధ్వనిధు♦రంధరభూరితరప్రబంధవా
గ్గుంభుల నాత్మలోఁ దలఁతుఁ ♦ గూర్మిని మల్హణ కాళిదాసులన్
దంభమయూర మాఘువర♦దండి ముఖాదిమ సత్కవీంద్రులన్.

చ. వినుతు లొనర్తు నాంధ్రసుక♦విప్రభు నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని ♦ జక్కన నాచనసోము సర్వదే
వుని భవదూరు వేము సల♦పోతన బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి ♦ ధూర్జటిఁ గేతన భట్టబాణునిన్.

కం. వెండియు నా దృతమతినై
నిండుమనంబునను దలఁతు ♦ నిఖిల ధరిత్రీ
మండల విశ్రుతకవితా
ఖండయశోనిధులఁ బేరు♦గల సత్కవులన్.

కం. చెలరేగి యంతకంతకుఁ
జలమున వాఁదడవఁ గుకవి ♦ సత్కవి యగునే

---

పాఠాంతరము. 1. నవ్వ.

యిలలోన నెంత బలిసినఁ
జెలఁగి వరాహంబు గంధసింధుర మగునే ?

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, సత్కవి కీర్తనంబును, కుకవి నిరసనంబునుంజేసి నవరసభావబంధురంబుగా నొక్క ప్రబంధంబు రచియింపం దలంచియున్న సమయంబున.

సీ. ఏమంత్రినునుఁజూడ్కి • ధీమదాశ్రితదైన్య
తామిస్రమునకు నైందవకరాళి
ఏమంత్రి యాజ్ఞప్తి • సామంతసీమంతి
నుల కొప్పు విరుల కగ్గలపుగాలి
ఏమంత్రి వితరణం • బినసూనుఖేచర
ప్రకటదానప్రౌఢిఁ • బరిభవించు
నేమంత్రికీర్తి నై • లేంద్రకన్యాధీశు
కంఠహాలాహలాం • కంబు గప్పు

తే. గీ. నతఁడు నేపాళ కురునిష • ధాంగవంగ
గౌళగాంధారమగధకొం • కణ విదేహ
నృప మహాస్థానకవివర్గ • నీయగుణుఁడు
చుండిరామయకాళుఁ డ • ఖండయశుఁడు.

సీ. కనకాంబరముల శృం • గారించి మించిన
మహనీయ నవరత్న • మంటపమున
ఘనసార చందన • కమనీయవాసన
లఖిలదిక్కులయందు • నలమి కొనఁగఁ
గవిగురుశేషవా • క్కాంతాధిపులఁబోలు
సత్కవీశ్వరులు పా • ర్శ్వములఁ జెలఁగఁ
దుంబురునారదా • దుల గెల్వజాలిన
గాయకు లగ్రభా • గముల మెఱయఁ

తే. గీ. కనక నవనవమాణిక్య • ఘటితభూ

గొలువు గొలువయి సాహిత్య♦గోష్ఠిఁ దగిలి
సన్నుతోదారుఁ డావేళ ♦ నన్నుఁ జూచి.

కం. "శివభక్తినిధివి మంత్రివి
కవితాభిజ్ఞుఁడవు నిత్య♦కారుణ్యమహో
త్సవుఁడవు కౌండిన్యకులో
ద్భవుఁడవుఁ గదుఁ గూర్చినట్టి ♦ బంధుఁడ వనఘా!

ఉ. పాటిగలట్టి మేటి యెడ♦పాటిపురాధిప, యెఱ్ఱనార్య, నీ
సాటిగఁ జెప్పినట్టి కృతి♦సాటువయై విలసిల్లుఁగా కిటల్
జాటుచు హీనమానవుల ♦ చాటువమాటున వ్యర్థకూటకా
ర్పాటకథల్ వినఁగ నగు♦బాటగుఁగాక రచింప నేర్చునే?

కం. మలహరుభక్తులలోపలఁ
బొలుపుగ నుతికెక్కి జగతిఁ ♦ బూజ్యుండగు నా
మలహణుకథ నావేరిటఁ
జెలువుగ నంకితముచేసి ♦ చెప్పఁగవలయున్."

చ. అనుచుఁ బసిండికోరఁ బ్రియ♦మారఁగఁ గప్రపు వీడియంబు గాం
చనమణిగంధసార ఘన♦సారవిభూషణవస్త్రసంపదల్
దనిపిన నాత్మలోపల ము♦దంబు వహించుచు నా ప్రసాన చం
ద్రునకును భక్తితోడఁ గృతి♦నూత్నగతిఁ సృజియింపఁబూనితిన్.

ఉ. ఇట్టిమహాప్రధానపర♦మేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి మేలు చండిపుర♦పాలక, కాశనమంత్రిచంద్ర, మున్
గట్టిగఁ గృష్ణరాయజన♦కాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడియైన యెఱ్ఱకవి♦రాజిత మల్హణకావ్యకన్యకన్.

ఉ. ఇమ్మహిఁ గల్గుమంత్రుల న♦నేకులఁ జూచితి మేము వారు మో
దమ్మున నిచ్చినట్టి ధన♦ధాన్యయుతంబగు దొడ్డయీవియున్
సమ్మతితోడ నీవొసఁగు♦సారపుఁ గప్రపువీడియంబు తు

ఉ. "ధన్యతఁ జుండికాళన, యుదారయశోంగన నిన్నుఁ గాని నే
నన్య మెఱుంగ"నంచుఁ గలశాంబుధిఁ దానముఁ జేసి రాజమూ
ర్ధన్యులముందటన్ దగఁ బ్రతాపశిఖం ధరియించి భోగిరా
జన్యశిరంబుఁ బట్టి జలశాయిపదంబులు ముట్టి మేల్గనున్.

సీ. తన సముద్ధతకీర్తి • దశదిశావిశ్రాంత
దంతిదంతములతోఁ • బ్రసరింపఁ
దనమనోహరమూర్తి • తరుణతాహంకార
మానినీజనముల • మరులు గొల్పఁ
దనదానవిస్ఫూర్తి • ధన రాజసంతాన
చింతామణిశ్రేణి • సిగ్గుపడఁగ
దనవాగ్విలాసంబు • దండశూకాధీశ
దేవేంద్రగురువుల • నేవగింపఁ

తే. గీ. బరగు సురసరిదురుతర•బహుతరంగ
నివహఘుమఘుమరవసమ•నినదసుకవి
ఫణితవరగుణమణిగణా•భరణశాలి
చుండిరామయకాళు డ•ఖండయశుఁడు.

ఉ. చెంపల గంధమున్ మెఱుఁగుఁ • జెక్కుల నొత్తిన మన్మథాంకపుం
గెంపులు వీటికావిహిత•కృత్రిమరాగము కంటి యెమ్మెలున్
మంపుగొనంగఁ గ్రుమ్మఱు కు•మంత్రులఁ జూచిన రోఁతమాను ని
ష్కంపనుఁ జుండిరామవిభు • కాళనఁ జూచిన యర్థికోటికిన్.

సీ. సంపూర్ణ చంద్రుఁడీ•సరసుఁడు కాళన
వివరింప రోహిణి • విస్సమాంబ
కందర్పుఁడమ్యో నీ•కాళనామాత్యుండు
విశ్రుత రతిదేవి • విస్సమాంబ
గంగాకలాపుఁ డీ•కాళనామాత్యుండు
వినుతపార్వతిదేవి • విస్సమాంబ

కలశాంబురాశి యీ • కాశనామాత్యుండు
విమలభాగీరథి • విస్సమాంబ
తే. గీ. యవని ననుకూల దాంపత్య • మగునటంచు
నఖిలజనములు వినుతింప • నతులమహిమ
మంత్రి రామయ కాశనా • మాత్యచంద్రుఁ
డనఘు విస్సాంబ నుద్వా • హామయ్యె నెలమి.

సీ. పరకాంతఁ జూడఁడు • పైత్రోవఁ జూచెనా
పగ్గించు నాఁటి కా • నివావిగాను
తఱచు మాటాడఁడు • తగుచోట నాడెనా
యబ్రహ్మపదము శి • లాక్షరంబు
తర మెఱుంగక యీఁడు • తగ మెచ్చియిచ్చెనా
చాలు నర్థికి జన్మ • జన్మములకు
మనసీక నిల్పఁడు • మది నిచ్చి నిల్పెనా
యది విభీషణు పట్ట • మచ్యుతంబు
తే. గీ. రక్ష రాష్ట్రమునకును శ్రీ • రామరక్ష
యాజ్ఞ సుగ్రీవునాజ్ఞగా • నడఁచె రిపులఁ
బుణ్యవంతుండు సద్గుణ • భూషణుండు
చుండిరామయకాశిఁ డ • ఖండయశుఁడు.

షష్ఠ్యంతములు

కం. ఈదృశగుణజలరాశికి
శ్రీదేవీవరతనూజ • శృంగారునకున్
భూదానభార్గవునకును
మాదేవీవరవిభూతి • మహిమాఢ్యునకున్.

కం. బంధురవిక్రమశాలికి
సింధుగభీరునకు శేము • షీధిషణునకున్
బంధుప్రియునకు నీతియు

కం. యోధాగ్రేసరునకు నుత
రాధేయసమానదాన • రసికాగ్రణికిన్
భూధరరిపువిభవునకు న
సాధారణ ధైర్యశౌర్య•సద్గుణమణికిన్.

కం. అద్రీంద్ర స్థైర్యునకు న్నా
మిద్రోహరగండ నవస•మీరబలునకున్
రుద్రాక్షభూతిభూషణ
ముద్రాంకునకున్ బ్రధాన•మూర్ధన్యునకున్.

కం. దుస్సంగదూరునకును న
భస్సింధుసమానకీర్తి•భరితాంకునకున్
నిస్సీమభూప్రదాతకు
విస్సాంబాధవున కఖిల•విద్యానిధికిన్.

కం. శ్రీమంతున కఖిలకళా
ధామునకును గీర్తినిధికి • ధర్మాత్మునకున్
సోమాంబాతనయునకు మ
హాబాహునకుం జుండికాళ•యామాత్యునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన మల్హాణ
చరితం బను మహాప్రబంధమునకుం గథాక్రమం బెట్టిదనిన—

సీ॥ కువలయకమలాభి•నవమనోజ్ఞం బయ్యు
బంకజీవనపరి•ప్లవము గాక
ఘనసారపున్నాగ•కమనీయ మయ్యును
కితవదుష్కానకసం•యుతము గాక
సాధుదానప్రౌఢి•యూధపం బయ్యును
విశ్రుతఖరసమ•న్వితము గాక
రాజితోత్తమజాతి•రత్నాంకితంబయ్యు

తే. గీ. వరసరోవరచయమును ♦ వనచయమును
నృపచయంబును దివ్యమం♦టపచయంబు
నెలమిఁ దనుబోలెననఁ బొగ♦డ్తలు వహించె
భువనసారంబు కల్యాణ♦పురవరంబు.

తే. గీ. కలితకైవల్యకల్యాణ♦కటకమనఁగఁ
గామితార్థైకకల్యాణ♦కటకమనఁగఁ
గమలసదనాంఘ్రికల్యాణ♦కటకమనఁగ
ఘనతఁగాంచెను కల్యాణ♦కటక మపుడు.

చ. గములుగఁ బద్మరాగములఁ ♦ గ్రమమరీచులు చౌకళింపఁగాఁ
గమలవనంబు లెన్నఁడు వి♦కాసముఁ గుందవు వజ్రమౌక్తికా
సమరుచిచంద్రికన్ గుముద♦షండములుల్ గసుగందకుండు నాఁ
గొమరగు దివ్యరత్నమయ♦గోపురవైభవ మెన్న నేటికిన్ ?

కం. కురువిందవజ్రమయగో
పురదీప్తులవలనఁ బొద్దు ♦ పోకల్ రాకల్
పరికింప నరిది యయ్యెను
సరసిజకైరవవికాస♦సంపదఁ దెలియున్.

కం. తలయెత్తి చూచినప్పుడు
తలవంచినయపుడుఁ దెలియు ♦ దైవతఫణిలో
కులవార్తలనఁగ వినుతికి
నలవియె పురికోటపొడవు ♦ నగడితలోఁతున్.

కం. దైవతమూర్తులు తేజో
వైవస్వతజనకు లేక♦వదనబ్రహ్మల్
పావనచారిత్రులు పుం
భావసరస్వతులు పురము♦బ్రాహ్మణులెల్లన్.

కం. వారణవారణసత్వులు

మారుత మారుతవేగులు
మారనిభుల్ పురమురాకః మారకు లెల్లన్.

కం. జలనిధి రోహణశైలము
మలయాద్రిన్ గనకశిఖరి మఱపించిరి యు
జ్జ్వలరత్నచందన శ్రీ
నలరెడు భువనైకవశ్యు లప్పురివైశ్యుల్.

కం. [1]బలబలభద్రులు శాత్రవ
దళదళనోన్నిద్రు లమిత దానమరుత్సుత్రిల్
లలనా భద్రులు కలఁగని
యలఘు గభీరత సముద్రు లాపురి శూద్రుల్.

కం. సటలాడింతురు సింహముఁ
బెటపెట బెబ్బులులపంక్తు పెఱుకుదురు మదో
త్కటదంతిఁ గూలద్రోతురు
పటుసమదోద్భటులు వీర భటు లవ్వీటన్.

కం. పిడికిట నడఁగెడు నడుములు,
నడిఁగాఁగిలిఁగొనని గుబ్బచన్నులు, చేరల్
గడచు తెలిగన్ను లప్పురి
పడఁతులకుం గాక కలదె పడఁతుల కెందున్.

కం. గళదండతుండగండ
స్థలదృఢ్మదకాండ భద్ర దంతులు చెలఁగున్
బలువిడి నెలయూటలతో
నలరెడు నలకొండ లనఁగ నప్పురిలోనన్.

కం. వరజవసంపద నప్పురి
తురగంబులఁ బోలలేని తుందుడుకున నీ
ధర నడువనోడి యప్పుడు
నరుగు నభంబున వితేజులై రవితేజుల్.

పా. 1. బలభద్రులు శాత్రవ నృప.

కం. మోపులు గ్రైకొని యమృతపుఁ
దీవుల కెడఁబడిన తరఁగ • లెలఁ గంభోధుల్
తేపులు మూపులు నప్పురి
వాపుల చలిగాడ్పులాని • వాపుల వదలున్.

వ. మఱియు నప్పురంబు సత్యలోకంబునుంబోలెఁ జతురాననాధిష్ఠితంబై, వైకుంఠపురంబునుబోలెఁ బురుషోత్తమావాసంబై, కైలాసంబునుంబోలె సర్వజ్ఞాభిరామంబై, అమరావతియునుంబోలె మఘువద్విజితంబై, అలకాపురంబునుంబోలె ధనదవిలసితంబై, నక్షత్రగ్రహమండలంబునుబోలెఁ గళానిధిశోభితంబై, వియన్నదియునుంబోలె లక్ష్మీసముదయంబై, మాతంగవిరహితంబయ్యు మదమాతంగయుక్తంబై, భోగిదూరంబయ్యు ననేకభోగిభూషితంబై, అశ్రుపాతంబు పురాణపఠన శ్రవణవేళ యంద, చేలచలనంబు ధ్వజంబులయంద, పరవశత్వంబు రతిసమయంబులయంద, దీర్ఘనిశ్శ్వాసంబు పారయోగులయంద, అన్యోన్య సంఘర్షణంబు యువతీస్తనంబులయంద, పాణిగ్రహణంబు వివాహంబుల యందకాని తనయందుఁ బొనరవనంజాలి చక్కఁదనంబుకుఁ జక్కటియు, మగతనంబులకు మగఁటిమియు, సంపదల కింపును, యశంబునకు వశంబును, సౌఖ్యంబులకు సౌఖ్యంబును, విద్యలకు నాద్యంబును, విశ్వాసంబున కాదికారణంబును నగు నప్పురవరంబున:—

సీ. యజ్ఞదత్తుండను • నవనీసురోత్తముం
డఖిలవేదంబుల • నభ్యసించి
నవరసజ్ఞాతయై • నవకళానిపుణుఁడై
సకలదేశంబులు • సంచరించి
ధనరత్నవస్త్రవా•హనతతు లొనగూర్చి
భాగ్యసౌభాగ్యవై•భవము లెసఁగ
వనజలోచనఁ బుణ్య•వతియను సాధ్విని
బరిణయంబై నిజ•బంధుజనము

తే. గీ. నాప్తవర్గంబు ముదమంది • యభినుతింప
నతిథిపూజలు సేయుచు • నాగమోక్త
క్రతువు లొనరించి పెద్దల • కరుణ గాంచి
నిండువేడుక దఖకొత్త • నుండియతఁడు.

కం. నరకాంబుధిఁ బడి మునిఁగెడు
పురుషునకుం దెప్పగాదె • పుత్త్రికుఁ డిలఁ "బు
న్నరకాత్త్రాయతి" యనియెడు
పరమశ్రుతిఁ దలఁపన్నతి • భావములోనన్.

కం. సంతానము యిహాపరమును
సంతానము పుణ్యలోక•సాధన మరయన్
సంతానము నిలహేతువు
సంతానము లేనివాని • జన్మంబేలా ?

కం. సుతుఁ డుదయించినమాత్రనె
పితరుల దుర్గతులుదొలఁగుఁ • బెరుఁగుచు మఱి యా
సుతుఁ డెంత చల్లనుండినఁ
బితరుల కతితృప్తి సేయుఁ • బృథుతరలీలన్.

కం. పితరుల సుగతికి మూలము
సుతుఁడ 'యపుత్రిస్య నాస్తి•సుగతి' యనంగా
లతికామూలన్యాయము
పితరులకును సుతున కండ్రు • పేర్కొని మానుల్.

సీ. వరగత్న ధనధాన్య • వస్త్రసమృద్ధైక
సీమలు గలిగిన • నేమిఫలము ?
మణిహేమమయకుడ్య•మంటప కమనీయ
ధామముల్ గలిగిన • నేమిఫలము ?
శ్యాలక జామాతృ • సఖ మిత్రి బాంధవ
స్తోమంబుగలిగిన • నేమిఫలము ?

చామరాందోళికా • ఛత్రసైంధవరథ
సామజంబులు గల్గ • నేమిఫలము ?

తే. గీ. ఘోరసంసారసాగర • సారనిబిడ
మధ్య నిర్మగ్నులై నట్టి • మానవులకు
నకట! దరిఁజేర్పఁ దెప్ప యై • నట్టిసుతుఁడు
గలుగకుండిన నెంతటి • ఘనునకైన.

మ. అని యూహించుచు నమ్మహీసురుఁడు చిం • తాయత్తవృత్తి న్న తా
నసుఁడై పుణ్యవతీవధూతిలకముం • దానుఁ నిజాంతర్గృహం
బునఁ గమ్మాయకభోజ్యవస్తువితతుల్ • భుంజింపఁగానీక యి
చ్ఛనజస్రంబును వత్సకాంక్షలను బ • శ్చాత్తాప సంయుక్తుడై.

మ. ఉపవాసంబులు సత్యధర్మమహితో • ద్యోగాదికృత్యంబులున్
జపముల్ విప్రకుటుంబ భోజనములుం • శాంతుల్ పయస్సత్రముల్
తపముల్ దైవతపూజనక్రియలుతీ • ర్థస్నానముల్ దానముల్
విపరీతప్రతిబంధమోక్షణవిధుల్ • వేమాఱుఁ గావించుచున్.

సీ॥ బహువిధస్తోత్రముల్ • పఠియింపఁ బఠియింప
బొలుపరి నోరెల్లఁ బొరట వోయె
మొగి వేల్పులకుఁ జాఁగి • మ్రొక్కంగ మ్రొక్కంగ
బొప్పిక నొసలెల్లఁ • బొగసుగట్టె
ధరఁబ్రదక్షిణములు • దిరుగంగఁ దిరుగంగ
నెల్లవెంటలను గా • ళ్లీచవోయె
విధులకై ధనములు • వెచ్చింప వెచ్చింపఁ
జెలువేది జేమెల్ల • జెరటయయ్యెఁ

తే. గీ. బూని యుపవాసములచేతఁ • బొగిలిపొగిలి
కోలుకొనలేక యొడలెల్లఁ • గుస్సిడస్సి
చాలు నన్నింట డెందము • చల్లనయ్యె
నింక నేమిటఁ దోడసఁ • గెటుమనుదు ?

తే. గీ. సురభిపొదుగున దుగ్ధముల్ ♦ దొరకుఁగాక
తవిలి యున్నె యజాగళ♦స్తనము లొడియ
నీశ్వరేశ్వరు కృపఁ గోర్కు ♦ లెనగుఁగాక
యితరకృత్యంబులందెల్ల ♦ నేల కలుగు ?

వ. అని తనవృత్తాంతం బాధర్మపత్నికెఱుంగఁజెప్పి తా నొక్కరుండ పురంబు వెలువడివచ్చి వచ్చి యఖిలజనానందమయి యవసరంబుల నుత్ఫుల్ల మల్లికా వకుళ కేతకీ కుటజ పాటలీ పున్నాగ పరిమళామోద పరిప్లుత పరిశ్రమ పథికజనానుమోదంబును, విచ్ఛిన్న స్వచ్ఛ గుళుచ్ఛ నిష్యూతమరందబిందు ధారానందిత తుందిలనటదిందిందిరమాలికా సందోహాక్రియాఝుంకారంబును, ఉన్మదశుక శారికా కేకికలరవకలకంఠకోమలతరంగితమేదురనాద మాధురీధురీణతామానంబును, బిసగ్రసనకౌతుకకలహంస సంకుల క్రేంకారగుంభితవిచరత్కిన్నర మిథునమధురగానంబును, సహకారకదళీపనస ఖర్జూరద్రాక్షానారికేళబిల్వజంబీరమాతులుంగఫలసమిత్కుశాయాత మునికుమారనిరంతరంబును నగు వనాంతరంబున నొక్కవటవిటపిచ్ఛాయం దపంబున్న కపింజలమహామునియాశ్రమంబుఁ జేరంజని-

సీ. తుండముల్ నిమురు భే♦రుండముల్ శరభంబుఁ
బాము భేకములకు ♦ బాముఁగడపు
నాగముల్ హరుల పు♦న్నాగముల్ గనిమెచ్చు
ముంగి రమ్మను ఫణి ♦ ముంగిటికిని
పులిపాలఁ ద్రావించుఁ ♦ బులిపాల మృగపిల్ల
పిల్లితో నెలుక దం♦పిల్లియాడు
తోడేలునకు మేఁత ♦ తోడేలు చింబోతు
పులుగువెట్టును డేగ ♦ పులుగునకును

తే. గీ. కారుపోతులఁగని యాడు ♦ కారుహయము
కొండగాఁ జూచుఁ గిశంబు ♦ కొండగోఁటియు
పికముపసాదు కాకంబు ♦ పికముతోడ

జాతివైరంబు లుడిగి తజ్జాతి నిట్టు
లెనసి కూడుండు ప్రాణు లమ్ముని యునికిని.

వ. ఇట్లున్న యమ్మునితపోమహిమకు నిచ్చమెచ్చుచుఁ జేరంజని సాష్టాంగదండప్రణామంబు లాచరించినం జూచి యమ్మాంనీందుప్రం డతని రాక మనంబున నెఱింగి నీమనోరథంబు సఫలంబయ్యెడు నిక్కడఁ దపం బాచరింపుమని యనుజ్ఞ యిచ్చిన నయ్యాజ్ఞదత్తుండును దదుపదిష్ట మార్గం బునఁ దపస్సాధనంబు లొనగూర్చుకొని యుండఁబునఁపర నందీశ్వరుహృద యారవిందంబునఁ బొందుపఱిచి ఫలాహారపర్ణాహారపవనాహార పరిహృతా హారుండై పరమతపోనిష్ఠవాటించుచున్న సమయంబున నప్పరమేశ్వరుండు ప్రసన్నుండై నం బ్రణమిల్లి యిట్లనియె.

సీ. "కరిముఖజనకాయ ♦ కనకాద్రిచాపాయ
మరుసంహారాయ న♦మశ్శివాయ
కుండలికటకాయ ♦ గోరాజవాహాయ
మాధవాస్త్రాయ న♦మశ్శివాయ
శైలజాధీశాయ ♦ సనకాదివంద్యాయ
మధుపాంతకాయ న♦మశ్శివాయ
సోమార్కనేత్రాయ ♦ సురనదీజూటాయ
మంత్రభూషాయ న♦మశ్శివాయ

తే. గీ. భక్తపరతంత్రహృదయాయ ♦ భవహరాయ
మాతృకావేష్టితాయ న♦మశ్శివాయ
సకలలోకాధినాథాయ ♦ శాశ్వతాయ
తే నమోస్తు మహాదేవ ♦ దేవ" యనిన.

మత్తకోకిల.

"భూసురోత్తమ, యాత్మమెచ్చితి ♦ పుత్త్రి నీ కిదె యిచ్చితిన్
వాసవాదులు సన్నుతించెడు ♦ వాని మత్ప్రియభక్తునిన్
రాసికెక్కుకులైకభూషణు ♦ రమ్యకీర్తివిరాజితున్
ధీసమున్నతు సత్కళానిధి ♦ దివ్యతేజు గుణాకరున్."

వ. అని సర్వేశ్వరుండు సంతానలబ్ధికై యొక్కసంతానఫలంబు దయచేసినఁ బుచ్చుకొని కపింజలమహాముని యనుమతంబునఁ బురంబునకరుగుదెంచి తనధర్మపత్నియైన పుణ్యవతికి నొసంగె నంతఁ గ్రమక్రమంబున.

సీ. పసిఁడిపుత్తడికిని • బల్వంబుమరువుగా
నిలిపినగతి మేను • పలుకఁబాఱె
కస్తూరి లాంఛన•గా నిడ్డ యమృతంపుఁ
గుంభద్వయంబనఁ • గుచము లమరె
లలి దంపతులమోహ•లతికాంకురంబన
గరువపునూగారు • గాననయ్యె
తన యాభివృద్ధిచే•తను లేమి యంతయు
బెడఁబాసె ననఁగ నె•న్నడుము వడఁకె

తే. గీ. సుషమసంతాన సౌఖ్యాబ్ధి • జొక్కి యాత్మ
నస్యముల రోయుగతి మది • నరుచి వొడమెఁ
దనయ లావణ్యరసపూర్తి • దైల మనఁగ
నంగనకు గర్భసంపద • యందమయ్యె.

కం. నవమాసంబులు నిండిన
యువతీమణి పుత్త్రుఁగాంచె • నురుతరతేజున్
భవకరుణామృతసాగర
భవవిగతకళంకకుముద•బంధుఁడనంగన్.

కం. "పలికవలెఁ జూడఁగవలె
బాలకునై దేండ్లు, బంటు•వలెఁ బెంచుచుఁ దా
నేలగవలెఁ బదియేఁడులు
వాలఁగ నటమీఁద సఖుని•వలెఁ జూడఁదగున్."

వ. అని యజ్ఞదత్తుండు పుత్త్రికునకు నుదయాది కృత్యంబులుగావించి విద్యానిధియను బ్రాహ్మణునొద్దఁ జదువం బెట్టిన నతఁడు.

సీ. అంగయుక్తంబుగా ♦ నామ్నాయములు రెండు
బల్లిపాఠంబుగాఁ ♦ బఠిచయించె
బ్రహ్మాండశైవాది ♦ బహుపురాణంబులు
కరతలామలకంబు♦గా నెఱింగె
భాట్ట వైశేషిక ♦ ప్రముఖశాస్త్రంబులు
నవగతంబులుగాఁగ ♦ నభ్యసించె
శుకుల వ్యాసాది దే♦శికుల తత్త్వార్థముల్
శోధించె నామూల♦చూడముగను

తే. గీ. వాదవహ్నిజలస్తంభ♦నాదు లరసె
నంజనాకర్షణక్రియ ♦ లలవిఁ గనియె
సరససంగీతసాహిత్య♦సరణిఁ దెలిసె
నఖిలవిద్యావిశారదుం ♦ డయ్యె నంత.

కం. అన్నగరము వేశ్యలలో
నెన్నంగా నొక్కబోటి ♦ యిల సన్నుంటన్
మిన్నక నడినన్నది యది
చెన్నలరుచునుండు మదన♦సేన యనంగన్.

కం. ఆయక్క యెన్ని నోములు
పాయక కడునోఁచికన్న ♦ బాలిక, కంతుం
డేయక దాఁచిన మోహన
సాయకమనఁ బుష్పగంధి ♦ సన్నుతి గాంచెన్.

కం. మొలకచనుమొనలు చెలువపుఁ
గళికలు చరణాధరోష్ఠ♦కరతలములు కెం
దలిరులు కురు లలికులముగ
గల మోహనలతిక పుష్ప♦గంధి యనంగన్.

కం. నెలవులు, మన్మథునమ్ముల
ములుకులు, విటజనులధైర్య♦మూలంబులకున్

దొలఁగని శరములు, విరహాల
కళికలు, ధరఁ బుష్పగంధి కన్నులతళుకుల్.

కం. కులమును గుణమును రూపును
గలిగినబాలికకు విద్య గలిగినయేని౯
తలపఁగఁ బసిఁడికి వాసన
కలిమియుఁ జెఱకునకుఁ బండుఁ గలుగుటగాదే ?

వ. మదనసేన విద్యానిధియను నాచార్యునొద్దఁ దన ముద్దుపట్టిం జదువంబెట్టిన నయ్యాచార్యుండును ;

సీ. బాలిక కక్షరాభ్యాసంబు గావించి
వర్ణక్రమంబుల వరుసఁ దెలిపి
బహువిధస్తోత్రముల్ పాఠంబు గావించి
వివిధకావ్యంబుల వినికిఁ జెప్పి
శబ్దప్రపంచంబుజాడ యెఱింగించి
సంధిసమాసాదిసరణిఁ జూపి
నాటకాలంకారనైపుణి సూచించి
చిత్రాశుకవితాప్రసిద్ధి గరపి

తే. గీ. యఖిలశాస్త్రపురాణేతిహాసమహిమఁ
బోధఁగాఁ జేయుటయు నంతఁ బుష్పగంధి
మలహణుఁడుఁ దానుఁ గూడి సమ్మోద మెలర్పఁ
జింతనలు సేయుచుండ్రు నిశ్చింతతోడ.

కం. సరికిని బేసికిఁ జదువుచు
నిరువురుఁ గవగూడి తిరుగనేర్చిరి విద్యా
వరనీతి నాఁడు నాఁటికి
సరసైకజనానురాగసమ్మదలీలన్.

వ. పలుకయు బుస్తకంబులును బట్టి కరంబునఁ బుష్పగంధి రా
మలహణు తల్లిదండ్రులును మచ్చిక రెట్టఁగఁ గన్య వానితోఁ

జెలిమికి వచ్చె నంచు దయ • సేయుచు వారివచోనిగుంభనల్
పలుమరు నింపుతోఁ జెవుల • పండువుగా వినుచుండు రెంతయున్.

కం. మలహాణునిం దమయింటికిఁ
బిలిచియు కొనిపోయి రత్న • పీఠిక మీఁదన్
నిలిపి తగఁబుష్పగంధియు
నలరఁగ సద్భక్తిఁ జేయ • ననుమోదించున్.

కం. ఆలోనఁ బుష్పగంధిని
జాలకుఁడను నటుని యొద్ద • సాముస కిడినన్.
మేలైన నాట్యవిద్యయు
బాలిక తగనేర్చి రాజ • పాత్రం బయ్యెన్.

సీ. మొగవరి కట్టడ • మొనవు కోలాటంబు
చొక్కంపు మురువులు • చిక్కణీలు
బరవుబారడుజేసి • బహుళరూపులఁదగ
బంధురగీతప్రి • బంధవితతి
వరుస పద్యము దేశి • బంగాళ గీతంబు
కొరుతికట్టడబిందు • కొటియకాఁడు
పరశరాముఁడు వీర • భద్రుండుకల్యాణి
చొకట్ల మెకతాళి • శబ్దమాది

తే. గీ. దేశిశుద్ధాంగములయందుఁ • దీఁగెబోఁడి
పటుతరంబుగ నిజపాద • కటక యుగళి
కఖిలపాత్రిమ్మలును • బొమ్మలగుచు వ్రేలఁ
బూన్కి వహియింపఁ బొగడొందెఁ • బుష్పగంధి.

తే. గీ. సకియ రేపును మాపును • సాముసేయు
పగలు రేయును జమువుపై • శాళి నుండు
వెలయు సంగీతసాహిత్య • విద్యలందుఁ
గమలలోచన నిస్సీమ • గా నెటింగె.

సీ. స్వరమండలంబును ♦ జంత్రింబు నొకవేళ
నింపుమీఱంగ వా♦యించుచుండ్రి
కిన్నర, వీణెయుఁ ♦ గేలిమై నొకవేళ
ముట్టిచూతురు జగ♦న్మోహనముగ
సొంపుగా దండెలు ♦ శ్రుతిగూర్చి యొకవేళ
పదములుఁ జిందులుఁ ♦ బాడుకొండ్రి
గీతప్రబంధముల్ ♦ కేళిఁ జిక్కణి పంతు
లనుకొందు రొకవేళ ♦ మనము లలర

తే. గీ. నార్యవృత్తంబులును జూర్ణి ♦ కావళియును
మక్కువలరంగ రాణింతు ♦ రొక్కవేళ
మంజరులు ద్విపదలును స♦మంజసముగఁ
జదువుకొనుచుందు రొకవేళ ♦ సరసలీల.

వ. ఇట్లు మల్హాణ పుష్పగంధులు బాల్యస్నేహంబునం గూడి చరియింప నెలప్రాయంబు దోతెంచిన.

చ. ఒసపరిలాగు బాగు సుగు♦ణోన్నతి రూపు విలాసరేఖయున్
రసికతపెంపు విద్య చతు♦రత్వముఁ గాంతియు దివ్యతేజమున్
బిసరుహసూతి యాతనికిఁ ♦ బేర్కొని మక్కువ నిచ్చెఁగాక నాఁ
బొసఁగునె మల్హాణుండు నృప♦పూజితుఁడై నవయౌవనంబునన్

సీ. రమణి చన్నులుచేసి ♦ రాలినరజముతోఁ
గమలసంభవుఁడు జ♦క్కవలఁ జేసెఁ
జెలువక్రొమ్ముడిచేసి ♦ చిందినకప్పున
మెఱసి విధాత తు♦మ్మెదలఁ జేసె
మగువకన్నులు చేసి ♦ మిగిలిన తళుకుల
నలువ క్రొమ్మెఱుఁగుఁ దీఁ♦గలను జేసె
సతినెమ్మొగముఁ జేసి ♦ జాఱిననునుకాంతిఁ
బరమేష్ఠి నిండుచం♦దురునిఁ జేసె

తే. గీ. పడఁతి తనువల్లిఁ జేసి త్రో♦వడిన తావిఁ
గనకగర్భుండు పుష్పవా♦సనలఁ జేసెఁ
గాక లేకున్న నీసొంపు ♦ గలుగు టెట్లు?
కమలగంధులలోఁ బుష్ప♦గంధి దనరె.

సీ. పటుమోహనస్ఫూర్తి ♦ పాలిండ్లు పాలిండ్లు
నుడురాజవైభవ ♦ మోము మోము
పంకజంబులతుది♦పదములు పదములు
కోదమతేటులకును ♦ గురులు కురులు
పసగల కపురంపుఁ ♦ బలుకులు పలుకులు
ముద్దుకెంజిగురాకు♦మోవి మోవి
సొగసు వెన్నెల సొంపు ♦ నగవులు నగవులు
హరిమధ్యమనఁగెళి♦కౌను కౌను

తే. గీ. మారుతూలికరీతిఁ జె♦న్నారు నారు
కంబువునకంటె మహిమ వె♦గ్గలము గలము
వజ్రములకును లేదు ప♦ల్వరుస వరుస
యనఁగ నుతికెక్కె రామ లో♦కాభిరామ.

వ. ఇట్లు మల్లాణ పుష్పగంధులు నవయౌవనారంభంబున.

సీ. శారదచంద్రుండు ♦ చంద్రికయును బోలె
లలి నొక్క కృత్తికై ♦ చెలఁగిచెలఁగి
ప్రసవబాణుండును ♦ రతిదేవియునుబోలె
భేద మించుకలేక ♦ బెరసి బెరసి
యమరచందనము వి♦ద్రుమవల్లియునుబోలె
నన్యోన్య వైఖరి ♦ నడరి యడరి
వరవసంతుండును ♦ వనలక్ష్మియునుబోలె
భావంబు లేకమై ♦ పరగిపరగి

తే. గీ. తోడునీడయుఁబోలెను ♦ దొరసిదొరసి
తనువు ప్రాణంబుఁబోలెను ♦ దనరి తనరి

లీలఁ గలనైన నెడబాయఁ♦జాల రెండు
మలహణుఁడు బుష్పగంధియు ♦ మరగి యెపుడు.

సీ. విద్యలు గని చొక్కు ♦ వేడుకఁ గొన్నాళ్లు
కొనియాడు వేడుకఁ ♦ గొన్నినాళ్లు
ఇహముఁ బరంబని ♦ యెంచును గొన్నాళ్లు
కూటువమేలనుఁ ♦ గొన్నినాళ్లు
ఇద్దఱివయసులు ♦ నీడను కొన్నాళ్లు
సన్నలుచూచును ♦ గొన్నినాళ్లు
వెడలుచో మూతులు ♦ విరుచును గొన్నాళ్లు
కూళ పాటుండనుఁ ♦ గొన్నినాళ్లు

తే. గీ. భూసురుండగు మలహణుఁ ♦ బుష్పగంధిఁ
గూడనిచ్చుట గాదనుఁ ♦ గొన్నినాళ్లు
మహితమాయాకళాధాన ♦ మదనసేన
మదనతంత్రవిజ్ఞాన యా♦మందయాన.

వ. అంత నప్పురంబునంగల విటవిదూషక ప్రేష్యనాగరికాదులు మలహణ పుష్పగంధుల యన్యోన్యానురాగంబులు దలంచి యిట్లని వితర్కించిరి తమలోన.

కం. కూడం జదివినకతమునఁ
జేడియ కితనికిని గోర్కి ♦ చేకూరె నిఁకఁ
ఓడన్ గట్టిన దూలముఁ
జాడ సుమీ చిత్తగతులు ♦ చర్చింపంగన్.

కం. చిన్నప్పటి ప్రేమంబును
గన్నెఱికపువిటునిమీఁది ♦ కాంక్షయు మనుజుల్
గన్నప్పటి చనుప్రేమయు
నెన్నగ మదిఁ బాయకుండు ♦ నింతుల కెందున్.

చ. చెదరనియట్టికోరికలు ♦ జెందిలినొందనియట్టి వేడ్కయుఁ
వదలనియటి కాంక్షలును ♦ వన్నె దొరంగనియట్టి సొంపులున్

గొదవడినట్టి బాగులును ♦ గొండికప్రాయమునందె కల్గి యా
మదవతిఁ బాయఁడెన్నఁడును ♦ మల్హణుఁ డెంతటిభాగ్యవంతుఁడో ?

సీ. కోర్కి మై దీనితోఁ ♦ గూడియుండగలేని
నరుఁడు దా నరుఁడె వా♦నరుఁడుగాక
యేపొద్దు దీనితో ♦ నెనసియుండనిమేను
మేనౌనె మఱి దారు♦మేనుగాక
వెస దీనిపలుకులు ♦ వినలేనిచెవులు దాఁ
జెవులె రాటనముల♦చెవులు గాక
సరసంబుగా దీని ♦ యురముపైఁ జేర్పని
కరము దాఁగరమె క♦క్కరముగాక

తే. గీ. దీనియధరామృతము చవు ♦ లానలేని
జిహ్వ జిహ్వయె శూర్పంపు ♦ జిహ్వగాక
దీని గూడనిదినములు ♦ దినములౌనె
గణనకును దుర్దినంబులు ♦ గాక యనుచు.

సీ॥ చిత్రోపధానవి♦చిత్రవితానాదు
లలవోకఁ గానుక ♦ లంపువారు
చీని చీనాంబర ♦ శ్రేణు "లూరక" యని
యర్పించి మీవార ♦ మనెడువారు
ఘనసార చందన♦కస్తూరికాదులు
పొరిఁబొరిఁ గొనియిచ్చి ♦ పోవువారు
ఘనవజ్రతాటంక ♦ కాంచీకలాపంబు
"లింద, కొమ్మని" వేడ్క ♦ నిచ్చువారు

తే. గీ. మధురఫలములుఁ బుష్పముల్ ♦ మక్కువలర
నూరకైనను గొనివచ్చి ♦ యొసఁగువారు
నైరి యప్పుష్పగంధివా♦హ్యాళిఁ జేసి
యఖిలజనములు మనముల ♦ హర్షమొదవ.

సీ. ముద్దియలావణ్య♦మునకు సంతోషించి
మెచ్చుచుఁ గుత్కిళ్లు ♦ మిఁగువారు
కను కని చేఁ జిక్క ♦ మనసు దీయఁగలేక
దినమును వెనువెంటఁ ♦ దిరుగువారు
పనుపు నెపంబునఁ ♦ బాలఁ జేరఁగవచ్చి
వావిరి నోరయుచు ♦ పోవువారు
శృంగారపద్యముల్ ♦ చెప్పించి తముదార
సారెసారెకు వినఁ ♦ జదువువారు.

తే. గీ. దూరమున నుండియైనను ♦ జేరవచ్చి
సొమ్ములును వన్నెసవురులు ♦ చూపువారు
పొలఁతిఁ దలపోసి యటమీఁదఁ ♦ బొగులువారు
నగుచునుండిరి మానవు ♦ లప్పురమున.

వ. అంత నమ్మదనసేన పరిజనంబులతోడ మల్హణు నివేదించి యిట్లనియె.

సీ. మొండితోత్తులమారి ♦ లండియూ కంకుఁడు
అంకెత సారంబు ♦ పెంకె గడుసు
పడుచు టక్కులదొంగ ♦ బడుగిడు నునుఁగంచె
బైసికొక్కెర బొంత ♦ పచ్చిలంజె
కక్కరంబుల గాచి ♦ కసుమాల మిబ్బంది
పీచి వాపేభ్యంబు ♦ వేరుపురుగు
ముక్కన్ను సబ్బందు ♦ ముక్కిడితొటకి
దిమ్మరి చాడియు ♦ దేశకూళ

తే. గీ. పుల్లెదాల్పరి మతిగొట్టు ♦ ముల్లెవిడుపు
దాఁట్ల తీతువు ఖోడుఁడు ♦ దాఁట్లగుల్ల
దుక్కిపిట్ట పిపాసంబు ♦ దోమతిండి
యితనిఁ బేర్కొని పలుమాట ♦ లెన్ననేల.

చ. ఎక్కడి బాపనయ్య, యితఁ♦డిక్కడ వచ్చుచున్నవాఁడు దా
నిక్కమె సాధుఁబోలి తన♦నెయ్యము దియ్యము చాలుఁజాలు నీ
చక్కటిఁ జేరనీయకుఁడు ♦ జూడఁ జలింపగ నీతఁ డెంతయున్
వెక్కసమైన చేఁత లివి ♦ పిన్నను నామదిఁ గోపమయ్యెడున్.

వ. అనుటయు నమ్మాటలు మలహాణపుష్పగంధులు విని తమలో నిట్లనిరి.

కం. పురజనము లాడువార్తలు
పరిజనములు పోవుపోక ♦ బాంధవసఖసో
దరజననీ వీక్షణములు
దరమిడి గుండియలవేఁడి ♦ తాఁకై యంతన్.

ఉ. ఎవ్వరిఁ గీడుపల్కితిమొ ♦ యెవ్వరిఁ జూడఁగ నాడినారమో
యెవ్వరి దూఱుచేసితిమొ ♦ యెవ్వరిమేలు సహింపమైతిమో
యెవ్వరి కెగ్గొనర్చితిమొ ♦ యెవ్వరి నెవ్వరిఁ బాసినారమో
యివ్విధి వట్టిరట్టు పడ ♦ నెట్టుగఁ జేసె విధాత యక్కటా!

కం. నొడిమలకుఁ గలవి లేనివి
గొడిమలుగట్టుచును జనులు ♦ కుడువనినోళ్లన్
గుడుపుచుఁ బోయెద రూరకె
ముడుగడలును జెరువుమూయ ♦ మూఁకుడుగలదే?

చ. అనుజులుఁ దల్లిదండ్రులు ని♦జాప్తులుఁబౌరులు బంధుకోటులున్
బనివడి యేనిమిత్తమునఁ ♦ బల్కెద రిందఱుఁగూడి వేడ్క నె
మ్మనమున గల్గి సిగ్గువడి ♦ మానితి మింతియకాక కల్గినన్
మనముల రట్టుచేసి యిఁక ♦ మాన్పఁగఁ గర్తలె యన్నిభంగులన్.

వ. అని యిరువురు నన్యోన్యానురాగసుఖంబులం దనరుచుండి రంత నప్పురంబున.

మ. కరుణాంభోధి సమాన మానవిలస♦త్కల్యాణ కల్యాణభూ
ధరధైర్యాస్పదచిత్త చిత్తజవసం♦తస్వాంతభూరిక్రపా

కరసౌందర్య విశేష శేషకటకా కల్యాంఘ్రి పద్మార్చనా
పరమప్రీత్యభిరామ రామయతపః ప్రాగల్భ్య లబ్ధోదయా !

కం. డిండీరహార సురవే
దండసుధాకుందబృంద ధావళ్యయుతా
ఖండతరకీర్తి వైభవ
చుండిస్థలకరణచంద్ర శుభగుణసాంద్రా !

మాలిని :

సరసగుణసముద్రా సంతతౌదార్యముద్రా
గిరిశచరణభక్తా కీర్తికాంతానురక్తా
తరణి సదృశతేజా ధన్యవాగ్జాలభోజా
దురితచయవిదూరా ధూర్తశిక్షావిహారా !

గద్యము

ఇది శ్రీమత్సకలసుకవిమిత్ర, సోమయామాత్యపుత్ర, సరసకవితాధుర్య, యెడపాటి యెఱ్ఱనార్య ప్రణీతంబైన మల్హణచరిత్రంబను మహాప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.



# మల్హాణ చరిత్ర.



## ద్వితీయాశ్వాసము.



శ్రీమహితవేద్యవాటిపు
రీమందిర భవ్యరూప • రేఖాస్పద సౌ
త్రామసమ వియ్యమాంబా
కామిత సాంగత్య చుండి • కాళామాత్యా.

వ. అవధరింపుము.

కం. ధనపాలుండను వైశ్యుని
తనయుఁడు ధనదత్తుఁ డపుడు • తనచెలికానిన్
బనిచెను బుష్పసుగంధిక
నొనరఁగఁ గన్నెరికమునకు • నొడఁబరపింపన్.

కం. నిలువెం డర్థంబడిగినఁ
గలఁగక యొసఁబడుము నాకుఁ • గలవాఁడవయో
చెలికాఁడ, మెచ్చునీకున్
గలదనినను మదనసేన • కడకును నతడున్.

ఆ. వె. ఏఁగి పుష్పగంధి ♦ యిందీవరేక్షణ
చదువ నాడఁ బోడఁ ♦ జతురయనఁగ
దగిలి చూడఁ బంపె ♦ ధనదత్తుఁ డనవుడు
మొరకు మాటలకును ♦ ముదముఁ బొంది.

సీ. అతని సన్మానించి ♦ యర్ఘాసనమునకుఁ
జేరంగ దీసి పైఁ ♦ జేయివైచి
కర్పూర తాంబూల ♦ గంధపుష్పాదులు
నయమార నిచ్చి లే ♦ నగవెలర్పఁ
దనముద్దుపట్టిముం ♦ దటఁ బెట్టి "యిశ్బాల
తగునయ్య, ధనపాల ♦ తనయునికిని
సతనికిఁగాక యీ ♦ యరవిందలోచన
యితరమానవులకు ♦ నేలనబ్బు"

ఆ. వె. ననిన "నిల్వఁడర్థ ♦ మడిగిన నోడఁబడు
మనుచు నంపె నన్ను ♦ నతివ, యిపుడు
అడుగు మేమియర్థ? ♦ మతనికి నిమ్మేలు
వార్త వేగఁ జెప్ప ♦ వలయు" ననిన.

కం. రాజా, రాజులు బ్రాఁతే
రాజులుధనపాలసుతుఁడు ♦ రాగుందు వెసన్.
రాజు మగఁడైన నేలా
గాజుంగడియఁబు కడమ ♦ గలదే యెందున్.

కం. చతురుఁడు ధనదత్తుఁడు గను
నతఁ డోసఁగెడు విడెము చాలు ♦ నన్యము లేలా?
బ్రతికితి భాగ్యము నేసితి
నతివేగమె పొమ్ము తెమ్ము ♦ నల్లునిగారిన్.

వ. అని మదనసేన యతని ధనదత్తుకడ కనిపి తనముద్దుకూతుం దొడలపై నిడుకొని బుజ్జగించి బుద్ధిగా నిట్లనియె.

కం. వయసు గలనాఁడె యర్థము
నయమున నార్జింపవలయు ♦ నానాభంగిన్
వయసుడుగ నుడుగు గడనయు
వయసే ధనమూలమంద్రు ♦ వారాంగనకున్.

కం. ఊరక పిలిచెదమన్నను
రారెవ్వరు తలకు నరులు♦రాఁ జూచిరయో
యూరయ నెంతటివారికి
గారవ మది దీనికంటెఁ ♦ గష్టము లగదే.

కం. కోఁతల గీతల వెల్లల
రోఁతలకును మూలమగుచు ♦ రూపతి మిగులన్
బ్రాఁతిచెడు ముదిసెనేనియు
లేఁతప్పుడె లంజెయున్కి ♦ లెస్సైయుండున్.

కం. తలనరసిన ముదివిటులును
గులహీనులుఁ గుండగోళ♦కులును గురూపుల్
కలిమి గలవారలైనను
వెలయాండ్రను నెపుడుఁ బ్రోచు ♦ వేల్పులుగారే.

కం. బొజ్జలు పెరిగిన సెట్లును
నొజ్జల్లును దడిక ద్రోపు ♦ లొంటరికాండ్రున్
లజ్జయెఱుఁగని విటులును
సజ్జకముగ వారసతుల♦జన్మఫలంబుల్.

కం. చక్కనివారలు జారులు
కక్కసమగువారు వన్నె♦కాండ్రున్ రసికుల్
చొక్కమగు రాకుమారులు
మిక్కిలి వెలయాండ్రపాలి♦మృత్యువు లరయన్.

కం. రొక్కంపు ధనమిఁగలిగిన
మిక్కిలియు గురూపియైన ♦ మెచ్చఁగవలయున్

తెక్కలిర్వై ధనమీయని
యకాంతుని నెనఁ గదియ ♦ నర్హంబగునే.

కం. డెందం బేరికి నీయక
యందఱఁ దనయాత్మలోన ♦ నడపుచు నయనా
నందంబుగ మెఱయఁగవలె
నందంబున వారకాంత ♦ లద్దము భంగిన్.

చ. బలపము లేఁతనవ్వు, నును♦బయ్యెద సన్నపుఁగావిచీర, మిం
చులుగొను జల్లజంపునును♦జూడ్కియె కన్నపుఁగత్తి, మోవి తీ
పలవడఁ జొక్కుచున్ దగ వి♦టావలిడెందముఁ గన్నపెట్టి యిం
పుల ధనమెల్లఁ దీసికొని ♦ పోవలెఁ గామిని గండిదొంగవై.

కం. మగవానిచిత్తమంతయు
నిగురొత్తఁగఁజేసి వేఁట♦యిట్టియపోల్కన్
దగిలింపక తాఁదగిలిన
మగువెంతయు సొంపుచెడి య♦మాన్యత నొందున్.

కం. వలచుటకష్టము వనితల్
వలచుట పురుషునికిఁ గాక ♦ వారాంగనకున్
వలపు దగ దెన్నిభంగుల
వలచినయెడ విఱుగనేర్పు ♦ వలెఁ దరుణులకున్.

కం. గరగరిక లేనిపట్టులఁ
బరికింపుచుఁ గల్లకీడు♦భావించుచు మై
నెరసులు వెదకుచునుండెడి
పురుషునిపైఁ గూర్మి వీటిఁ ♦ బోవదె సతికిన్.

సీ. పురుషుని నెచటికిఁ ♦ బోవంగనీయక
వింతచేఁతల గురి♦వేయవలయు
నవనవసురతతాం♦డవసౌఖ్యవార్థిలో
ముంచి యింపులఁ బొద♦లించవలయు

గలసినయప్పుడు ♦ వలచినయట్లుండి
యెనసి వేడుకఁ జిత్త ♦ మెఱుఁగవలయు
మందుమంత్రంబులు ♦ మాయలు ప్రీతివన్ని
తెగువమై నవలీలఁ ♦ దిరుగవలయుఁ

తే. గీ. గలసినప్పుడు చనవిచ్చి ♦ కలయవలయు
పాయునప్పుడు నిచ్చయు ♦ సేయవలయు
నయముఁ బ్రియమును దప్పక ♦ నడవవలయు
నమ్మికలుగాఁగఁ దగవులు ♦ నడపవలయు.

వ. అనియిట్లు మదనసేన తనకూఁతునకు బుద్ధిచెప్పుచునుండె నంత వసంతాగమం బేతెంచిన.

ఉ. వచ్చెవసంతుఁడంచుఁ బ్రియ♦వార్త యొకింత యెఱుంగఁజెప్పినన్
మెచ్చి సమీరచారునకు ♦ మెప్పుగ నవ్వనదేవతాంగనల్
మచ్చికఁగట్టువర్గము స♦మర్పణచేసిరొ యంచు భూజనం
బచ్చెరువందఁగాఁ దరుల♦యాకులు దుల్లెఁ గ్రమక్రమంబునన్.

చ. లలితలతావగూహనము♦లం బులకించినరీతిగప్పలున్
బలియుచుఁ బల్లవించె నటఁ ♦ బల్లవముల్ తళుకొత్తి యొప్పుమై
నలి సుమనస్స్థితుల్ గనియె ♦ నాసుమనస్ స్థితిఁ జెంది యంతఁగో
ర్కులు ఫలియించె నాఁగను ద♦రుప్రకరంబు ఫలించె నెంతయున్.

సీ. సాలరసాలర♦సాలసాలంబులు
కోలకంకోలత♦కోర్కులములును
చాంపేయచాంపేయ♦చాంపేయనికరంబు
కేసరకేసర♦కేసరములు
మరువకమరువక♦మరువకానీకంబు
పాటలపాటల♦పాటలాలి
కురవకకురవక♦కురవకానీకంబు
కాంచనకాంచన♦కాంచనములు

తే. గీ. చందనద్రుమచందన॥చందనములు
దారుదారుకసద్ఛదా॥దారుసమితి
మాలతీకృతమాలత॥మాలవితతి
తాలహింతాలతాలల॥తాలతైక
వనము లింపారె భువనపా॥వనము లగుచు.

చ. అలికలకంఠగానము శు॥కారవగుంభితతాళమానమున్
కలరవహంసకేకిరవ॥కాహళమర్దళతుండికాధ్వనుల్
చెలఁగఁగ గాఢ్వనర్తనము॥చేయఁగఁ బుష్పాడిరంగవల్లికల్
వొలిచిన నాట్యశాలలనఁ॥బొల్పగుఁ బూఁబొదరిండ్లు సొంపునన్.

వ. తదవసరంబున.

కం. దండిగ మన్మథునగరికి
దండుగఁ లోడఁబరుపు లంపె॥తల్లులెదోరతై
మెండుగ విఱుగఁగ వచ్చెను
బండుగదుర్విటులు బాఁడు॥బండుగ నంతట.

సీ. అల్లువారలఁ దమ॥యాఁడుబిడ్డల నొగిఁ
బుట్టినిండ్లకును గొం॥పోవువారు
తైలాజ్యగుడదుగ్ధ॥తండులానీకంబు
నాశ్రితులిండ్లకు ॥ నంపువారు
జామాతలనుగూడి ॥ సంభ్రమంబునఁదాము
యభ్యంగములఁదీర్చి ॥ యలరువారు
హితభృత్యసఖబంధు॥సుతదారలనుగూడి
మృష్టాన్నభక్ష్యముల్॥మెక్కువారు

తే. గీ. దానధర్మపరోపకా॥రానుబుద్ధిఁ
దవిలి భూసురసంసేవఁ ॥ దనరువారు
వరదుకూల విభూషణా॥వలి ధరించి
మెండుకొని వీథులందును ॥ మెలఁగువారు.

సీ వెచ్చానకేమైన ♦ వెస నియ్యబడియెడు
నని పుల్లదీఁగెల ♦ కలుగు విటులు
తొడవులు దొడఁగట్టి ♦ నెడలేక బెదరక
యెరువుసొమ్ములు వెట్టి ♦ తిరుగువిటులు
వెడలఁ ద్రోపులుపడి ♦ వెస నేమియును లేక
చోరఁజోరవిద్యకుఁ ♦ జొచ్చువిటులు
నభిమతార్థము లిచ్చి ♦ యన్యోన్యలీలల
నువిదలఁ బెడఁబాయ ♦ కుందు విటులు

తే. గీ. మాడలనిచూపి భ్రమయించి ♦ మతముఁ బన్ని
సుదతులకు రిత్తమాటలు ♦ నూపువిటులు
గణనకెక్కిన తత్పురాం♦గణమునందు
మెలఁగుచుండంగఁ గడువింత♦చెలువు దోఁచె.

వ. అంతనటయున్న మొరకుండును మదనసేన వీడ్కొని సంభ్రమంబున.

కం. చనివేగమె ధనదత్తునిఁ
గనుఁగొనుటయుఁ జూచి యతఁడు ♦ "కాయయొ పండో?"
యన మొరకుండనియెను "దా
బనివినగా యోనె యెపుడుఁ ♦ బండేకాదే".

వ. అనినఁ గౌఁగిలించి మెచ్చుభ్రమింగుమీాయని యొక గొంటుపోక విడియం బతనికిం బెట్టి యిట్లనియె:

ఆ. వె. అత్త యేమియనియె ♦ నాపదు చేమనె
నీవు నేమియంటి♦నిక్కువముగఁ
బారు లేమియనిరి ♦ పరికింప వారింటి
చేటు లేమియనిరి♦ చెప్పుమనిన.

కం. ధనదత్తుఁ డనినమాత్రనె
విని సంతసమందె నగ ▲ [illegible]

గనుమూసియుండె సిగ్గునఁ
జనులకు బరిజనుల కాత్మ ♦ సమ్మతమయ్యెన్.

కం. విను మేమిటి కాలస్యము
నినుఁ దెమ్మనె మదనసేన ♦ నేఁటి ముహూర్తం
బునఁ బుష్పగంధి నిన్నును
నెనయఁగసమకూర్ప మంచి ♦ దెంతయుననుచున్.

కం. మున్నాదిసరకుజడ్డలు
గొన్నక్ లాభించుఁ బిదపఁ ♦ గొనఁ జేకురునే
యెన్నంగ నదియు నిటు లే
యెన్నైనను గలయ నిచ్చు♦టింతయు లెస్సక్.

వ. అని యిట్లుండ వెనుక నన్ను దూరం బనిలేదు మదనసేన ప్రభావంబు సూచించెద నాకర్ణింపుము

కం. ఆతెఱవ రయాగ్రహించిన
భూతంబులు నొచ్చుఁ జిచ్చు♦పొలయఁగ వెఱచున్
జేతనసంభవమాయా
కౌతుకవిద్యావిభేద♦కారిణి యగుచున్.

సీ. నేలకు నింగికి ♦ నెఱయఁదాపలు వెట్టు
చెలరేఁగిరోఁకటఁ ♦ జిగురుఁగోయు
గడు బట్టతలలు మోఁ♦కాళ్లను ముడివేయుఁ
గొసరక వడగండ్ల ♦ గుళ్లుగట్టుఁ
బూన్కిమై నంగళ్లఁ ♦ బులిజున్ను లమ్మించు
నయమునఁ జట్రాత ♦ నారఁదీయు
నొండొండఁ గొండలు ♦ గుండుగా దాఁకించు
వదలక నడురేయిఁ ♦ బగలుసేయు

తే. గీ. రూఢిమెఱయంగ నిసుమునఁ ♦ దాడ్రిదుఁ జేను
లెక్కసేయక చుక్కల ♦ లెక్కవెట్టు

గాలిఁ నోడిఁగట్టు మంచుఁ గుం♦చాలగొలుచు
మదనమాయాకళాధాన ♦ మదనసేన.

సీ. వెడవెడ వలపులు ♦ వెదచల్లి దొరలచే
నడియాలములు దీసి ♦ కడకుఁ దోలఁగు
ననుపువారలఁబట్టి ♦ పెనుబులుపై బట్టి
ధట్టించి నగరెక్క ♦ ధనముఁదివియు
పెంపుదుగున్నల ♦ పెద్దశృంగారించి
వింతవారలఁగని ♦ వెఱ్ఱిగొలుపు
ధనికులకడ కేఁగి ♦ తనసొమ్ము వారొద్ద
బోయెనంచేమైనఁ ♦బుణికికొనును

తే. గీ. గోరి తనకును లోనైన♦వారినెల్ల
బనికిఁ బాటకు బంట్లకా♦బల్లిగట్టి
క్రొత్తవారలఁ గనుఁగొన్న ♦ నెత్తుసేయు
మాటలనె తీయు ధనమెల్ల ♦ మదనసేన.

వ. అని మొరకుండు చెప్పిన మాటకు నవ్వి ధనదత్తుండు తన తెలంగు వినుమని యిట్లనియె.

సీ. దైవాలకును రిత్త♦దండాలు గిండాలు
గాని యెన్నఁడు నొక♦కాసు నీయఁ
గవిగాయకులు వచ్చి ♦ గణుతించి వేఁడిన
వదలిపోవుటెకాని ♦ పైక మియ్యఁ
జుట్టాలకును వట్టి♦సుద్దులు దుద్దులు
గాని యెన్నఁడును డ♦గ్గరఁగనీయఁ
బైతోవవచ్చిన ♦ పరదేసియొరదేసి
మోసపుచ్చుటెకాని ♦ గాసమీయఁ

తే. గీ. బట్టుకొని బందికాండ్రను ♦ బాధపెట్టఁ
బెంచులే చూప నొకబలు♦వీసమైన

బ్రహ్మరాక్షసిశాకిని ♦ బ్రతిదినంబుఁ
కూఁతలేకాని ముద్గెఁడు ♦ కూడువెట్ట.

సీ. మునుపు దొంగలకుఁబో ♦ యిన గొడ్డలే కాని
తగిలి బాపలకు గో ♦ దానమీయ
కొఱమాలి ముఱిగిన ♦ కూష్మాండములె కాని
దాక్షిణ్యమొదవంగ ♦ దానమీయ
పెనుదొజ్జపెసలు ము ♦ క్కినబియ్యమేకాని
యంగళ్ల నమ్మింతు ♦ ననువు లెఱిఁగి
వడ్డికాసులు గూర్చి ♦ వత్తికవియె యిచ్చి
పొరుగిండ్ల వంక నే ♦ ప్రొద్దుఁ బోదు

తే. గీ. ఈఁగకై బలి యెన్నఁడు ♦ నీయకుందు
పాముకై బలిపెట్టను ♦ బ్రతిభతోడఁ
గదిసి యెంగిలిచేతను ♦ గాకి నేయ
నెరయ నాజాడ నెవ్వరు ♦ నెఱుఁగరోయి !

కం. విను మాటలె పచరింతును
ధన మప్పుగ నిత్తుఁ బిదపఁ ♦ దగులందీతున్
ధనదత్తుగాని సేఁతలు
వినరా యెవ్వారు నీకు ♦ వింతయె మొరకా !

వ. అని నీవుపోయివచ్చిన ప్రయోజనంబులకుఁ బోరానిపక్షంబైనఁ జూచుకొందమని నిజనివాసంబునకుం జని యప్పుడఁటెం దలంచి నిలుకాల నిలువ సహింపక డోలాయమానమానసుండై యప్పుడు

తే. గీ. బేరసారంబుమీఁదటి ♦ ప్రేమ లుడిగి
సెట్టిసానివిలాస మీ ♦ క్షింపరోసి
సత్రసాలయ్యె ముద్దాడఁ ♦ సైఁచఁడయ్యె
వనితమీఁదటి హాళి న ♦ వైశ్యవరుఁడు.

తే. గీ. కాసు విడిచినఁ బ్రాణ మాకసముఁబట్టు
ముదితఁ జూడక ప్రాణంబు మున్నె పోవు
దెగువ నీ రెంటికిని నేది తెరువు చెపుమ
పాపి! లంజరికంబ! నీబంటుఁగావు.

సీ. చక్కిలంబులుగొన్ని చవిచూచు నందంద
మెల్లనె యనుపగుగిల్లుసమలు
చల్లగావలెనని చలిమిడి భక్షించు
నొకపాటుగాఁగఁ బానకముఁద్రాగు
నయనపోలయ్యకు నంజలి ఘటియించుఁ
దులసితీర్థముసఁ గన్నులు దోలంచు
తలగోడతోడుతఁ దాఁకించుకొనఁబోవు
పాపిదైవమే, యని పంట్లుగొఱుకు

తే. గీ. నడిచిపడుఁ బొత్తికడు పంతఁ బొడిచికొనును
మూల్లు నిద్రయు నాహారమును త్యజించి
యున్నచో నుండ సైఁపక యొఱలియొఱలి
మొరక, పోదమురమ్మను ముదితకడకు.

వ. ఇట్లు ధనదత్తుండు మనోజవ్యథ సైరింపలేక తన నిజసఖుం డైన మొరకుం బిలచి యిట్లనియె.

కం. పోకున్న మనసు నిల్వద
యోకొండిన లంజెపిలువ దేలా గిఁకఁ దా
నాకుంగలచెలికాఁడవు
చేకూరఁగ వేగ బుద్ధిసెప్పు మటన్నన్.

కం. మానినిఁ గలయక యింతట
మానిన ననుమానమాను బ్రాణముఁ దనువున్
ప్రాణము గలిగిన సకలముఁ
దానూరక గలుగుననిన ధనదత్తుండున్.

ఉ. పుట్టెఁడు నేయి నూనె పది♦పుట్లు సడించిన సన్నబియ్యమున్
బెట్టెఁడుపట్టుచీరలును ♦ బిందెఁడుమాడలు చాలఁ గ్రొవ్విరుల్
నొట్టునఁ బట్టుగొజ్జెఁగులు♦నూఱును నేఁబదిసూకరంబులున్
బట్టెయమంచముల్ పదియుఁ ♦ బంపెను లంజియవారి యింటికిన్.

వ. అంపిన నమ్మదనసేన కన్నుదనిసి తగినచుట్టంబులుం దానును దనయిలు వేలుపులకుం బెట్టుకొని విభూషణభూషితయై పుష్పసుగంధినలంకరించుకొని యప్పుడు.

కం. తొలువినికి నభవుముందట
నలికుంతల పుష్పగంధి ♦ యాడెడు ననుచున్
గలయంగఁ బురములోపలఁ
బొలఁతుక చాటించె దిశలు ♦ భోరునఁగలఁగన్

కం. చాటించినఁ బైపైఁబడి
మేటీమేటీలు దొరలు ♦ మెలఁతలు విటులున్
కోటానకోట్లు వచ్చిరి
వీటంగల రసికులెల్ల ♦ వేడుకఁజూడన్.

సీ. వాపికా మధురికా ♦ పావకాహాళముఖ
తుండికాశంఖాది ♦ తూర్యవిదులు
డమరుగ ఝిల్లికా♦ఢక్కాళీమర్ధళ
ఝల్లరీఝుంకార♦చతురమతులు
చిత్రవీణావిపం♦చీమత్తకోకిల
లానైనకిన్నర♦లాక్షణికులు
ఘంటికాజయఘంటి♦కాకమఘనతాళ
సప్తపద్యాదిప్రి♦స్తారచణులు

తే. గీ. సకలవాచాభినయకళా♦ప్రకటనటులు
గాయకులు నంగనలు నాది♦గాఁగఁ గలుగు

మేళములవారిఁ గూడి స♦మేళమెసఁగ
శంభునగరికి వేంచేసె ♦ సంభ్రమమున.

చ. ఉరమున రత్నకంచుకము ♦ నొప్పులపెండెము వజ్రమౌక్తికా
భరణములుం ధరించి చెలి♦పైఁ గరపల్లవ మల్లఁజేర్చి యా
నిరుపమరంగమధ్యమున ♦ నిల్చెను వేడుకఁ బుష్పగంధి తో
ల్కరిమెఱుపుంబలెన్ జనుల♦కన్నులకున్ మిఱుమిట్లు గొల్పుచున్.

వ. అప్పుడు మల్లణుండు చనుదెంచి యప్పుష్పగంధి నాట్యంబు చూచుచుండె నవ్వైశ్యుండు నొక్కెడం గనుంగొనుచుండె; నయ్యవసరంబున.

సీ. శ్రుతులకు నింపుగా ♦ శ్రుతికదంబము చేసి
లీలనాలాపముల్ ♦ మేళవించి
మంద్రమధ్యమతార♦మానంబు లడరంగ
గమకించి నిఖిలతా♦యములుముట్టి
షాడవౌడవశుద్ధ ♦ సంకీర్ణములుచూపి
వివిధరాగంబులు♦వేళనెఱపి
యాహతప్రత్యాహ♦తాదులుసమకొల్పి
స్థానమానంబులు ♦ సరణినిల్పి

తే. గీ. తాళమడరంగ నర్థంబు ♦ దప్పకుండ
నొప్పి రంజిల్ల రసములు ♦ నుప్పతిల్ల
వరుస లేర్పడ నన్నింట ♦ వన్నెగలుగఁ
జతుగగతులను బాడంగ ♦ శంభునెదుర

వ. నిలిచి పుష్పాంజలులిచ్చి ముఖచాతుర్యంబును నటించి మలహాణుకోటి కూటమిదె జన్మసహస్రంబులకుఁ గలుగజేయుమని యంతర్గతంబునం దలంచి మ్రొక్కుచు.

ఉ. ఇందుధరుండు మెచ్చఁ దర♦హేక్షణ పుష్పసుగంధి సల్పెవే
డ్కం దగునృత్యముల్ మురజ♦కాహళమర్దళడిండిమధ్వనుల్

గ్రిందుగ నెల్లవారలకుఁ • గౌతుకమీనఁ బదాంబుజద్వయం
బందెలు గల్లుగల్లన వి•టావలిగుండెలు జల్లుజల్లనన్.

సీ. చారణబాగడ•చర్చరీబహురూప
దండలాసాదిక•భాండికములు
కందుకకోలాట•కానాట్యతాసభ
పేరిణకుండలి•ప్రేక్షణములు
సూతముల్ పుహుఁడక•శుద్ధపద్ధతి చిత్రి
పద్ధతి ఘనదేశ • పద్ధతులును
కైలాటలంబక•కరణైకతాళికో
లాసాదిగీతహ•ల్లీసకములు

తే. గీ. నాదిగాఁగల్గునృత్యన్రు•త్యైక్యముఖ్య
నాట్యవిధములుసూచించి•నయమెలర్ప
జనులకెల్లను లోచనో•త్సవము గాఁగ
నాడె నాయిందుముఖి కొని•యాడె జగము.

వ. ఇట్లు పుష్పసుగంధి నృత్యంబునల్పుటయు నద్దేవదేవుస్థానికులు దొరలు పౌరులు కనకాంబరాదు లపరిమితంబుగాఁ గట్టనిచ్చిన మేళంబుల వారుం దానును సందుకొనుచు నుత్సాహంబున మదనసేన నిజనివాసంబున కరిగినఁ దక్కినవారలు యథేచ్ఛం జనిరి. మలహణుం డప్పుష్పసుగంధిహృదయంబుఁ దెలియం దలంచి యద్దేవదేవుని యుద్యానవన ప్రాంతంబునఁ బథంబుఁగాచుకొని కనుమఱుఁగుననుండె నప్పుష్పసుగంధి మలహణుంజూచువేడ్క భానుమతియను చెలియుం దానును నొక్క వట విటపిప్రదేశంబున నిలిచి నిట్టూర్పు నిగుడించుచుఁ దమకులంబు నిందించుచు దుఃఖావేశంబున నిట్లనియె.

కం. ఎఱుకలు మాలిన యేభ్యపు
మొఱకులు గదునొనఁగుదాన•ములు నతికష్టల్
పఱిచినపాటులఁ బడిపడి
నరమగువేశ్యలకు వేఱు•నరకము గలదే!

కం. డొల్లంబొట్టయు వంకర
కాళ్లును బెనుగాలుఁ బెలుచఁ◆గల ధనదత్తుం
జెల్లంబో కని యెవ్వరు
నుల్లంబున నోకిలించ◆కుందురె చెప్పుమా.

కం. నేనెక్కడ! తానెక్కడ!
నానోముఫలంబుగాక ◆ నాకుం దనకున్
మానుగఁ బొందిక లేదా?
ప్రాణసఖీ, యింతకంటెఁ ◆ బాపము గలదే!

ఉ. వేయునునేల నామనసు◆వేడుక మల్హణుమీఁదఁ గాని యో
తోయజగంధి, యన్యునెడఁ ◆ దూఁకొనిరోయుచునుండు నందన
చ్ఛాయలఁ గల్పకప్రసవ◆సౌరభమానుచుఁ జొక్కి మక్కువం
బాయనితేఁటి హేయమగు ◆ ప్రబ్బలిపూవుల కాససేయునే.

కం. తొలిఁదొలిఁ గోమటిముఱికిం
గలిసిన నరకాబ్ధిఁగూలఁ◆గలుగుట కాదే
చెలియా, పిలుచుకరమ్మా
మలహాణుముఖమైనఁ జూతు ◆ మనసారఁగన్

వ. అనుటయుఁ దత్ప్రాంతంబుననున్న మలహాణుండు చిఱునవ్వు నవ్వుచు నరుగుదెంచి నిల్చినంజూచి పుష్పగంధి యతని దుప్పటి చెఱంగుఁ గరంబునం జుట్టి పట్టుకొని యిట్లనియె.

కం. "ఇందడవు నెందు నుండితి
విందుముఖుల్ రాఁగఁ జూడ ◆ నేఁగితివో! నే
సిం దరసి నిన్నుఁగానక
కుందఁగ మది నీవు డాఁగి◆కొనఁ దగవగునే?"

వ. అనిన నమ్మలహాణుం డిట్లనియె.

ఉ. ఓచపలాక్షి, యోయబల, ◆ యోయలికుంతల, నీకుఁగాన నేఁ
గాచియున్నవాఁడ నిదె ◆ కౌఁగిటిలో నను గారవించవే,

పూచిన మావిమోకకడఁ ♦ బొంచియు మర్మములంట నేయుచున్
ఏచిన పంచసాయకుని ♦ యిమ్ముగ దొఱంగదు కంటె దూరఁగన్.

సీ. కలకంఠకంఠి, నీ♦కన్నులు చాలవే
యవలీల భువనత్రి♦యంబు గెలువ
పద్మాయతాక్షి, నీ♦పలుకులు చాలవే
సరసులహృదయంబుఁ ♦ జల్లఁజేయ
కాంతాలలామ, నీ♦కన్నులు చాలవే
దేవేంద్రభోగంబు ♦ ధిక్కరింప
కిసలయపాణి, నీ♦కెమ్మోవి చాలదే
నయమున ప్రాణదా♦నంబు సేయ

తే. గీ. నాతి, నీపొందు చాలదే ♦ నాకు నిపుడు
నంచితానందసౌఖ్యంబు ♦ లందఁజేయ
నితరకృత్యంబు లెవ్వియు ♦ నేల నాకు
నిన్నుఁ జూచుట చాలదే ♦ నెలఁత, యనిన.

కం. రమ్మా మలహణ, తగునా
యిమ్ముల నను నెరవు చేసి ♦ యిట్లాడంగా
నెమ్మనమును బ్రాణంబును
నిమ్ముగ నీసొమ్ముఁజేయు ♦ టెఱిఁగియు మఱియున్.

ఉ. ఎవ్వరు తమ్ముఁజూచుదురొ ♦ యెవ్వరు తల్లికి విన్నవింతురో
యెవ్వరు తప్పనాడుదురో ♦ యీపనికంచుఁ దలంక కెంతయున్
మవ్వమెలర్పఁ గౌఁగిటను ♦ మల్హణునిం గదియించి యాత్మలో
నెవ్వగమాన మోవిచవి ♦ యిచ్చుచుఁ బుష్పసుగంధి యర్మిలిన్.

చ. చెలి నెడగాఁగ నిల్పుమని ♦ చేరువనున్న లతాగృహంబులో
పలికిని గొంచుఁబోయి తన♦ప్రాణవిభుఁన్ వనదేవతాంగనల్
సలలితమంగళాక్షతలు ♦ చల్లుచు దీవన లిచ్చుభంగి మా
ఖులఁ బడుపుష్ప కేసరము♦లుఁన్ బికరావము లింపొనర్పఁగన్.

కం. గొజ్జఁగిపూఁబొదరింటను
సజ్జకమగు విరులసెజ్జ ♦ సంతస మొదవన్
లజ్జావతి ప్రాణేశ్వరు
హృజ్జనితవినోదకేళి ♦ కెంతయు దార్చెన్.

చ. కరమణికంకణక్వణము ♦ కంఠరవంబులు కాంచికాసము
త్కరమణికింకిణీధ్వని ప♦దద్వయనూపురరావ మింపుగా
సురతనవీనతాండవముఁ ♦ జూచి మరుండనునొజ్జ ద్రేయు పెన్
దరువన వేణి వీపునను ♦ దార్కొనె నాట్యపుబొమ్మయోయనన్.

తే. గీ. యువతిసురత వేళ ♦ నొప్పెఁ జన్నులకును
మోమునకును నడుమ ♦ ముదియునగలు
చంద్రచక్రవాక♦సమరంబు వారింప
నడ్డగించు తార♦కాళి యనఁగ.

చ. అనువుల నైనదప్పు లధ♦రామృతపూరముచేత నార్చుచున్
గినుకలు నింపులుం బెరుఁగఁ ♦ గ్రింద టమీఁదటలై యథేచ్ఛలన్
దనియక యింతియుం బతియుఁ ♦ దర్పకకేళి సుఖించి రర్మిలిన్
ఎనుబదినాల్గు బంధముల ♦ నించుక యించుకఁ వేడ్కఁజూపుచున్.

సీ. అంగుష్ఠమణకాలు ♦ నఖరమండలి పిక్క
చిఱుదొడయును గటి ♦ చెలఁగునాభి
చనుముక్కు వక్షంబు ♦ నునుగళంబును జెక్కు
నెమ్మోవి కనురెప్ప ♦ నెరులు శిరము
శుక్లపక్షంబున ♦ సారిదిమై నెక్కించి
బహుళపక్షంబునఁ ♦ బరగ దించి
పెనఁచి పట్టియు నెత్తి ♦ చెనకి రాఁజికిలించి
కదిమియు సలమియుఁ ♦ గరఁచినొక్కి

ఆ. వె. త్రిప్పి యాని మోవి♦తీసియు వేసియు
ననఁగఁ బరగుచున్న ♦ యతిరహస్య

మదనతంత్రవిధుల ♦ మానినిఁ జొక్కించి
మలహణుండుచొక్కి ♦ మరుకవలర.

తే. గీ. గండభేరుండపక్షిసం♦గతి దలిర్ప
నిటియుఁ బెనఁకువ సం దోక♦యింతలేక
మేనుపొక్కటిగ్రమ్మ మోము ♦ కానరాఁగ
నలసి నిద్రించి రింతియు ♦ సవిభుండు.

ఉ. పల్లవపాణికిం బతికి ♦ భావజకేళిపరిశ్రమంబులోఁ
జల్లగఁ జల్లగాడ్పు వెద♦ చల్లఁబ్రొడంగె రసాలవల్లరీ
తల్లజకేతకీక్రముక♦తామరసాంబు పటీరపాటలీ
హల్లకమల్లికావకుళ♦హారిసగంధసుగంధవాసనల్.

చ. ఇరువురు నిద్రమేలుకొని♦యించుకసేదలుదేఱ వెండియుఁ
సురతవినోదకౌతుకము ♦ చూడ్కులఁగ్రమ్మగఁ జుంబనాదులన్
బరిపరిరంభణంబుల న♦వారణఁ దీరనియట్టి కాంక్షలున్
పరిపరిలాగులన్ గలయఁ♦బైకొని వేడుకఁగూడియున్నెడన్.

కం. వెలినుండి యవ్విలాసిని
తలఁకుచుఁ బఱతెంచి "యింత♦తడ విట్లునిలువన్
మలహణ, తగునా" యనుటయు
వెలఁదుకయును దాను సచట ♦ వీడ్కొనియంతన్.

కం. అడుగిడుచు మగుడిచూచుచు
నడు గామడగాఁగనలసి ♦ యటఁ దాటిరిలుచున్
వడిసీళ్ల కెదురు నడిచిన
వడువున నెడఁబాసి చనిరి ♦ వనితయుఁ బతియుఁ.

వ. ఇట్లు లిరువురు నిజనివాసంబులకుం జని తమకలయుతెఱం గెరికిఁ దెలివిపడకుండునట్లుగా మజ్జన భోజనంబులు దీర్చి యెప్పటియట్ల యుండి రంత.

ఉ. గంధపుఁబొట్టు వీడియముఁ ♦ గచ్చులపాగయుఁ గావిదుప్పటిన్
సందులఁ బూసలుఁ జెవుల♦చాటున నీలపుదంటపోగులున్
కందినయట్టి వెండిమొల♦కట్టును నీలపు టుంగరంబులున్
బొందపు కిఱ్ఱుచెప్పులునుఁ ♦ బొల్పెసఁగన్ ధనదత్తుఁ డెంతయున్.

కం. కోమటిజాణలు కొందఱు
వేమాఱును బాడుకొనుచు ♦ వెనువెంటను రాఁ
బ్రేమమున నరిగెఁ బిల్లల
తో ముదిపందియునుబోలె ♦ దుస్సహలీలన్.

ఉ. వచ్చినకూర్మియల్లునికి ♦ వంచనలేక నివాళులిచ్చి లో
నచ్చెరువున్ ముదంబుఁదొలు♦కాడఁగ గొజ్జఁగినీట బాదముల్
మచ్చిక దూతికల్గడుగ ♦ మన్ననదోఁపఁగ మేల్మిపీఠముల్
మెచ్చఁగనుంచి యందఱు స♦మేళముతోఁ బ్రియమారఁ జూచుచున్.

తే. గీ. కప్పురపువీడియంబును ♦ గైరవస్లు
పరిమళంబులు గంధపు♦ష్పములు నొసఁగి
వదన మించుక యెత్తి య♦మ్మదనసేన
పలికె ధనదత్తుతోడ ను♦త్కలిక యొసఁగ.

కం. ఏకోర్కులు మదిఁ గోరితి
మాకోర్కులె కన్నదనియ ♦ నంపితి వకటా,
నీకున్ బ్రీతి యిఁక నేఁడె
మాకున్ దెలియంగఁ జెప్పు♦మా సంప్రీతిన్.

ఉ. ఇచ్చితిఁ బుష్పగంధిఁ దర♦వీక్షణఁ జక్కని పుష్పకోమలిన్
బచ్చనివిల్తుకేళి నిఁకఁ ♦ బాయకకూడి సుఖింతు రింక పెం
పచ్చువడంగఁ బౌరజను♦లందఱు నచ్చెరువంద గోరికల్
పెచ్చుగ నెచ్చరింప మదిఁ♦బేర్చి యఖండిత వైభవోన్నతిన్.

సీ. పగడంపుఁగంబాల ♦ పచ్చటోవరియును
నవరంజికాళంజి ♦ యలరుఁ బాన్పు

బంగారుసకినెల • పట్టెమంచంబును
వజ్రాల నునుజాల • వల్లికయునుఁ
కుంకుమతలగడ • గొజ్జంగిపూఁదెఱల్
తరమైన చంద్రకాం • తంపుగిండి
చౌసీతిరతముల • సవరనిమేల్కట్లు
దీపించుమాణిక్య • దీపకళిక

తే. గీ. పౌసగఁ గస్తూరివేది క • ప్పురపుసురటి
విలువుటద్దంబు రత్నంపు • నెత్తుపలుక
తళుకు దంతపుఁబావలు • కలికి చిలుక
గలిగి యొప్పారుచవికలో • పడకటింట.

క. అల్లుఁ గూతుం బదఁడని
యల్లనఁ దత్పరిజనంబు • నంపుచుఁ బలికెన్
మెల్లనఁ జల్లనిమాటల
నుల్లము రంజిల్లఁ గరుణ • యును వర్తిల్లన్.

కం. “రసికులరు మీర లన్నిట
పసినిసు విది యెఱుఁగఁ జెప్ప • పనిగొనుఁ దేమే
విసువక తుమ్మెద యరవిరి
కసుగందకయుండ రసముఁ • గైకొనుభంగిన్.”

వ. అని యతనిం జవికలోఁ పలికిం బొమ్మని విలాసిని భానుమతి మొదలైన చెలికత్తియలం గూర్చి పుష్పగంధి నుండుమని మదనసేన యభ్యంతర గృహంబునకుం జనియె నంత.

కం. పెనుగంబంబున కేనుం
గును దార్చినరీతి తాయి • గుడిమీఁదికి నో
య్యన నడుపు భంగి సకియలు
వనితామణి పుష్పగంధి • వైశ్యనికడకున్.

కం. చని వాని పట్టెమంచము
[1]కొనఁదాఁ గూర్చుండి లోనఁ ♦ గుందుచుఁ జెలులం
బనుల నెపంబున నొయ్యనఁ
గనుసన్నలఁ జీరుకొనుచుఁ ♦ గనలుచు నంతన్.

ఉ. చూచెనువాని నయ్యబల ♦ చూపుల వాకొలుపం బిశాచమున్
జూచినయట్లు మర్కటముఁ ♦ జూచినపోలిక గొల్లకేతనిన్
జూచినరీతిఁ గాకసముఁ ♦ జూచిన కైవడి దుర్నిమిత్తముల్
చూచినలీల హేయమును ♦ చూచినమాడ్కిని జూచి రోయుచున్.

చ. కటకట ! పార్వతీరమణ, ♦ కంతుమదాపహా, భక్తలోల, నీ
కిటు తగునయ్య, నాదు హృద♦యేశ్వరు మల్హణుభావమందువి
స్ఫుటగతిఁ దొంటిజన్మమునఁ♦బూజరొయొనర్పక యుంటినయ్య, హా
త్స్ఫుటమున దుఃఖవార్ధి బడఁ♦ద్రోచితి నన్ దయలేనివాఁడవై.

కం. కలుషాత్ముల నతికష్టులఁ
గలవారలఁజేసి రూప♦గాంభీర్యదయా
కలితులఁ బేదలఁ జేసెడి
పలుమరువుగఁ బెట్ట నీకుఁ ♦ బాడియె రుద్రా

కం. ధనదసఖుఁ డగుటవానికి
నను నమ్మను మదనసేన ♦ నయనిధికి మహో
ఘనకీర్తికి మల్హణునకు
ధనమీయక పెద్దసేయఁ ♦ దరమె మహేశా.

కం. ఘనుఁడంచు నిట్టులూరక
సునిశితముగ నతని నింత ♦ చూచితి వయ్యో,
ధనదత్తుపాటి చేయఁడె
మనసిజహర, మల్హణుండు ♦ మది నీ కెన్నన్.

పా. 1. కనుసం.

కం. పగఁబాయుమీఁ దగుతాలిమి
మగవారును నాఁడువారు ♦ మము నెన్నంగా
నగుబాటుగఁ బెడఁబాపితి
దగవా పగవారిఁగూడ ♦ దైవము, నీకున్.

కం. అని తలపోయుచు నిట్టులా
వనితామణి విరహవహ్ని ♦ వారింపను నే
యనువును లేకయ్యెడ శం
భుని పదపద్మములఁ బ్రాపు ♦ పుచ్చుచునుండెన్.

కం. అట్టియెడన్ ధనదత్తుఁడు
చిట్టకములఁ నబలమీఁదఁ ♦ జేసాఁచి మదిన్
బట్టఁగఁ దలఁచినఁ బట్టి
కిట్టాటనో యిట్లుపట్ట ♦ నేటికి ననుచున్.

వ. ఉన్నయెడ నమ్మల్హాణుండు తనసఖుండగు సుశీలుండును దాన నప్పుడు తన నిజాచార్యుండైన విద్యానిధికడ కేఁగి నమస్కరించిన నయ్యాచార్యుండు నతనిం గనుంగొని యిట్లనియె.

కం. "ఇదియేమి నేఁడు మల్హాణ
వదనాబ్జము సొంపుదక్కి ♦ వసివాడి కడున్
హృదయంబు విన్నవోవుచు
నెదవడియున్నాఁడ వింత ♦ యేటికి ననినన్.

కం. తలిదండ్రులు నిను నేమేఁ
బలికిరొ ! పురిజనులు నింద ♦ బరచిరొ ! యొడలిన్
గలిగెనొ నీరసమేనియు !
సలపుష్పసుగంధి సేమ ♦ మైయున్నదియో?

కం. కనుఁగొనము మూఁడునాలుగు
దినములనుండియును జదువఁ ♦ దీఱదొ ! వేత్తే

పని యేమేనియుఁ గలిగెనొ!
వనిత న్నినుఁగూడి చనువ • వల దన్నదియో?

కం. గుణవంతుఁడ వన్నింటను
గణనకు నెక్కితివి రూప • కలితుఁడవు సుధీ
మణివి మనోజ్ఞవచోభూ
షణుఁడవు మద్భక్తి నిధివి • చనునే యనినన్.

కం. "ఏనేరము నెవ్వరియెడఁ
గానము గురునాథ, నీదు • కారుణ్యముచే
నీ నిఖిలము ననుకూలమె
యీనెలఁతుక యందుఁగాన • మపకృతియెందున్.

వ. అని మలహాణుండు సుశీలు మొగంబుఁ జూచిన నతం డిట్లనియె:

చ. "మలహణ పుష్పగంధులు క్రి • మంబునఁ గూడి చరింప భూ జనుల్
కలయవి లేనివిం బలుకఁ • గా విని యందఱఁ జాల దూఱి యీ
వెలఁదుకతల్లి యల్లి యిలు • వెళ్లఁగ నీయక యొక్కవైశ్యునిన్
గలిగినవానిఁ గూడుకొని • కన్నెఱికంబున కుంచె నచ్చెలిన్.

కం. అది కారణముగ మలహణు
హృదయము విహ్వలతఁ జెంది • యిట్లయ్యె"నన
మదిఁ గంది పల్కెనాయన
"ముదితలుగారోటు దుఃఖ • మూలము" లనుచున్.

సీ. పణ్యాంగనారతిఁ • బాయకుండుటఁ జేసి
మధుపానగోష్ఠికి • మనసుపెట్టు
మధుపానసుఖముచే • మరగి మాంసమునకై
వేఁటపైఁ జిత్తంబు • విడియఁజేయు
వేఁటపైఁ జిత్తంబు • విడియ ధూర్తులతోడ

ననిశంబు జూదంబు ♦ లాడుచుఁ దనయిచ్చఁ
దోస్త్రోన చేయును ♦ దుర్వ్యయంబు

తే. గీ. దుర్వ్యయుండయి పరుసంబు ♦ దొనరఁ బలుకు
పలికి యంతటఁ బరదండ ♦ నలకుఁ జొచ్చుఁ
గాన వ్యసనంబునకు నాది ♦ కారణంబు
తలఁచి చూడంగ వారకాం ♦ తారతంబు.

చ. అటమట లేక మోహమున ♦ నంఘునిపత్రికిత్రియ నుండి యంతటన్
దుటుకునఁ బోవు నోటిగడు ♦ దోరన వీడగనాడు, కుక్కయా
దట మఱి దాలిగుంటకడ ♦ ధ్యానముతోడను నుండి మిన్నకే
లోటలోట వచ్చుఁ బోవుకిత్రియు ♦ లోకులఁ గస్తాని విచ్చిచెచ్చెరన్.

కం. నడవగవలెఁ దగునడవడిఁ
దడయక సంసారియైనఁ; ♦ దానటుగాఁడేఁ
బడిసెట్లనె కూడగవలెఁ
గడగానక వేశ్యలింట్లఁ ♦ గడతేరుట కుఱ.

తే. గీ. ఇంట నిల్లాని లొల్లక ♦ నీవ లవల
గాక రేచుకమూతులు ♦ నాకబోగ
నొడలు పట్టంగ ముక్కయును ♦ దొడుగుమేయ
రెంటికిని గాక చెడి నట్టి ♦ రేవ డనఁగ.

కం. సురపతియును జందురుఁడును
బరకాంతలఁగోరికాదె ♦ పనిచెడి దోషా
కరులై యపకీర్తులఁ బడి
వరుసలుచెడి రందు రెల్ల ♦ వారలు నవ్వన్.

చ. అరయఁగమానహాని ధన ♦ హాని సమంచితకీర్తిహానియున్
బరమవివేకహానియును ♦ బాంధవహానియుఁ బ్రాణహానియున్
సురుచిరపుణ్యహానియును, ♦ జొప్పడునెప్పుడుఁ దప్పకుండఁగా
బరసతిగోరువారలకుఁ ♦ బల్మఱు నెంతటివారికేనియున్.

కం. పర నారీ సంగమ సుఖ
మరనిముసము పరధనాప♦హారణమున నిజో
దరపూర్తి గొన్ని దినములు
నరునకుఁ గల్గోపభోగ♦నరకము దీసన్.

కం. శ్రోత్తులఁ దగిలినవారికి
నెత్తుచెడున్ శ్రీలుచెంద ♦ వే కాలంబున్
హత్తదు మోక్షము మఱి వి
చ్ఛిత్తులగున్ మంత్రతంత్ర ♦ సిద్ధులు మిగులన్.

చ. మునివరుఁడైన జేపకడ♦ముండ మొకం బొకయింత చూచినన్
మునుఁగును బాతకంబులను, ♦ ముట్టినమాత్రిన పోవుఁ బుణ్యముల్,
పనివడి దానియూర్పు పయిఁ ♦ బాటిన నాయువణంగు, దానికా
ల్గనఁగ నొకింతదాఁకినను ♦ గాంచునుజెట్ట సురేంద్రుఁడేనియున్.

కం. ఎన్ని వ్రతంబులు సల్పిన
నెన్ని యుపాసంబు లున్న ♦ నిల దీర్థంబుల్
యెన్నేనాడిన, విధవను
గన్నను దోషంబుఁ గలుగుఁ ♦ గలలో నైనన్.

కం. తోషింప నిజకుటుంబముఁ
బోషించుచు నతిథిపూజఁ ♦ బూన్చుగా గరుణా
న్వేషుండగు పుణ్యంబున
కీషన్మాత్రంబు సరియె ♦ యెన్నేఁగ్రతువుల్.

కం. కులపతి శిశువులుఁ దానున్
దలమొలకును లేక నలిగి ♦ దైన్యపడంగాఁ
దలఁపక యుండిన దోషము
కులకోటుల నరకమునను ♦ గొని మునిఁగించున్.

కం. తావలవకున్న సౌఖ్యం
బేవలననులేదు వలచె♦నే దుఃఖంబౌ

కావున నన్యస్త్రీరతి
యీవసుమతిఁగూడదందు • రెఱఁగినజాణల్.

తే. గీ. పగటు నుపవాసదినములఁ • బర్వతిథుల
సంధ్యలను గాదు రతిసల్ప • సజ్జనులకుఁ
బాయు నాయువు పగటిచే•భంగమొందుఁ
దలఁగు సంపద దుష్టసం•తతిజనించు.

కం. అతిసురతము రోగపద
మతిమోహము సకలహాని•యగు నీరెండున్
కతిపయదినముల నరునికి
నతికష్టముఁ జేయునందు • రాయుర్వేదుల్.

వ. అనుసమయంబున భద్రదత్తకూచిమార పాంచాలాదులు, విటవిదూషక ప్రేష్యనాగరకాదులుఁ జనుదెంచినఁ గూర్చుండుమని విద్యానిధి పాంచాలునింజూచి మదనతంత్రంబులు మీఱెఱుంగనివిలేవు; స్త్రీపురుషులకు జాతిలక్షణంబును దదీయానుకూల నిర్ణయంబులును నెఱింగింపు మనిన నతం డిట్లనియె.

సీ. మొదలఁ గళాస్థాన•ములు దుష్ట తిథులును
జాతిభేదంబులు • సత్త్వములును
ద్రవనిర్ణయములు బం•ధ విశేషచాతురి
దతియుఁగాలము వయో•ధర్మములును
నెఱతనంబులును యో•నిప్రమాణంబులు
వలపులొల్లములును•గలయు తెఱఁగు
నింపులు ననురాగ•హేతువుల్ పరిరంభ
ణము లుత్తమాధమ•నాయకులును

తే. గీ. మదనపంచాంగమును యంత్ర • మంత్రతంత్ర
విధులు వశ్యౌషధక్రియల్ • వెరవులెఱిఁగి
కలసిరేనియుఁ గూరిమి • నిలుచుటరిది
వారిజాక్షుల గెల్వ నె•వ్వరికి వశము?

వ. అయినను నే నెఱింగిన తెఱంగున విన్నవించెద నాకర్ణింపుము.

సీ. తనువు మార్దవమును ♦ మనసు చాంచల్యంబు
తనివిదీఱమియుఁ జిత్తి ♦ నికి నమరు
ఘనకుచద్వంద్వంబు ♦ కఠినాంగకములును
దృఢమగురతియు హ ♦ స్తినికి నమరు
ఇఱికుబ్బచన్నులు ♦ నిఱుపేదకౌనును
గినుకయు నరయ శం ♦ ఖినికిఁ దొరయు
సరసంపుఁజేఁతలు ♦ చతురసంభాషణల్
మృదువర్తనములు ప ♦ ద్మినికిఁ మెఱయు

తే. గీ. మధువువాసనయును గరి ♦ మదముకంపు
నింపుగంధంబు వికచప ♦ ద్మంపుఁదావి
గలిగియుండుర్రి నలుగు రతి ♦ జలముతోడ
నంద్రుదు కామకళావేదు ♦ లఖిలవంద్య!

సీ. కన్నులు దిప్పుచు ♦ పన్నులు పచరించు
రూపుఁ జూపుచును భ ♦ ద్రుండు దిరుగు
నెదిరియిం పెఱుఁగక ♦ యీావి యెంతేనిచ్చి
తనయిచ్చ నెప్పుడు ద ♦ త్తకుఁడు దిరుగు
మందు మంత్రంబులు ♦ మాయలు పచరించి
ఖండించి కూచిమా ♦ రుండు తిరుగు
మనసులు గరఁగించి ♦ మర్మజ్ఞుఁడై రతిఁ
దేలించు సతులఁ బాం ♦ చాలుఁ డెపుడు

తే. గీ. భద్రకుఁడు సూవె చిత్తిని ♦ పాణివిభుఁడు
హస్తినికి దత్తకుఁడు మనో ♦ హరుఁడు మిగులఁ
గూచిమారుండు శంఖిని ♦ కూర్చు ప్రియుఁడుఁ
జాలఁ బద్మిని మెచ్చుఁ బాం ♦ చాలుఁ డెపుడు.

కం. లోలల భద్రకు విధమున
బాలలఁ బాంచాలురీతిఁ ♦ బ్రౌఢల నెల్లన్

జాలఁగ దత్తకుగతి జవ
రాలిం దగఁ గూచిమార◆రమణుఁడు గవయున్.

సీ. పరకాంతగూడని ◆ పతి యనుకూలుండు
తరుణికి మొఱఁగునేఁ ◆ బౌరి శఠుండు
దక్షిణుం డాత్మనం◆దటి సరిగాఁజూచు
నపరాధి యయ్యుఁ గిం◆డాడు ధృష్టు
విటుఁడు వేశ్యలయిండ్ల ◆ వెదకి కుర్విమ్మఱుచుండు
మతసేవకుఁడు పీఠ◆మర్దకుండు
నాగరకుఁడు పర◆స్త్రీగమనాపేక్షి
యలవిదూషకుఁ డప◆హాస్యకారి

తే. గీ. అరయ సాత్త్విక పతి కెన◆యైన బోటి
చతురభాషలఁ జతురిక ◆ చాలప్రోడ
సతులఁ బతులను గూర్ప సం◆చార నిపుణ
తిరుగు నే పనులకును దూ◆తిక ధరిత్రి.

సీ. బాలయయ్యును గళా◆ప్రౌఢి చూపువిదగ్ధ
యొకపాటియెఱుకమై ◆ నుండు మధ్య
యౌవనంబున నుండి ◆ యతిమూఢ యగుముగ్ధ
పరుషంబులాడెడు ◆ పడఁతి పరుష
అంటైన గరఁగెడు ◆ నంగనామణిశ్లథ
ఘనయనుసతి యతి◆కఠినగాత్రి
యలిగి కీడ్పడకుండు◆నట్టి కోమలి ధీర
పతిభక్తిగలిగిన◆నతి స్వకీయ

తే. గీ. జారపరకీయయనియెడు ◆ చపలనేత్రి
విత్తమంతయు లోఁగొని ◆ వెడలఁద్రోయు
మోహమింతయులేక మో◆మోట మెడలి
వారకాంతాలలామ సా◆ధారణాఖ్య.

సీ. ఆచారధీసుగుణాన్విత మునిసత్వ
నలి నిద్దురయె కోరు నాగసత్వ
భూతసత్వయు నెందుఁ బొందదు సంతుష్టి
జడమలినాంగి పిశాచసత్వ
గంధర్వసత్వ చక్కనిది పాడఁగ నేర్చుఁ
దలఁక దేవసులకు దైత్యసత్వ
శృంగారవతి కోమలాంగి కిన్నరసత్వ
యధిపుఁ దోషించును యక్షసత్వ

తే. గీ. జడతలోనుండు సతి విప్రజాతి దగయ
నధికరాజస నృపజాతి యగులతాంగి
విసుగు గను వైశ్యజాతి సాధ్వీలలామ
చతురయగు నన్నిటను శూద్రజాతిలలన.

సీ. స్వాధీనపతిక నిజాధీశు వశునిగా
మెలుపంగనేర్చిన మీననయన
వాసకసజ్జిక వరునిరాకకు మేను
నిల్లు శృంగారించు నిందువదన
పరకాంతఁగలసిన పతిచిహ్నములు జూచి
వగచు ఖండితయును వనజగంధి
రమణుండు వేళకు రాకున్నఁ బొగిలెడు
నది విరహోత్కంఠయను లతాంగి

తే. గీ. యొరలుఁ బ్రోషిత ధవుఁ డెడయున్న పతికి
నలరుఁ గలహాంతరిత నాథు నలిగి త్రోచి
వేగుఁ బతి నిచ్చఁగానక విప్రలబ్ధ
మఱవ కభిసారికాఖ్య గుబ్బమ్మరును నిచ్చ.

తే. గీ. హరిణి యశ్వని యభికయు ననెడు మువురు
సతుల గుహ్యప్రమాణముల్ సమరతములు

నాఱు తొమ్మిది పండ్రెండు ♦ నంగుళములు
పొసఁగు శశ వృష ఖరజాతి ♦ పురుషులకును.

కం. ఉచ్చరతి నీచరతు లగు
హెచ్చిన గుందినను రతుల ♦ కింపవు నది తా
మచ్చుపడఁగూడి రేనియు
నిచ్చకమై వారసతుల ♦ కిం పగు వేడ్కన్.

కం. ఏటికి మందులు మాయలు
నేటికి ద్రవ్యంబు జాతు ♦ లింతుల మనసుల్
నాటుకొన విభుఁడు చల్లని
మాటలఁ గరఁగించి కలయు ♦ మతమదియైనన్.

కం. మనసెఱిఁగి బాహ్యరతులను
బెనుపుచుఁ జొక్కొర్చి యింపు♦బెరయఁగ నెపుడున్
దనసుఖము దలఁపకుండెడు
మనుజునిఁ బాయంగఁగలరె ♦ మగువలు జగతిన్.

సీ. మృదుమార్గమునఁగాదె ♦ గొదలేక గాడ్పులు
చొరరాని చోటులఁ ♦ జొచ్చి విడుచు
మృదుమార్గమునఁగాదె ♦ నదనదీజలములు
కొండలఁ దెగఁబాఱి ♦ కుప్పంగఁజేయు
మృదుమార్గమునఁగాదె ♦ యదనెఱింగి మిళింద
మలరుల తేనియ ♦ లపహరించు
మృదుమార్గమునఁగాదె ♦ యది చంద్ర చంద్రిక
మేలైన పటికంపు♦ఱాఁలు గరఁచు
తే. గీ. గాన మృదురీతి మెలగెడు ♦ మానవుండు
సంగనా చిత్తవృత్తుల ♦ లొంగఁగొనును.
నఖల కార్యంబులును వాని♦హస్తగతము
లెన్నిచూచిన సంశయ ♦ మింత లేదు.

వ. అని పాంచాలుండు పలికినఁ గూచిమారుం డిట్లనియె.

కం. ఒడ లలయించుక యూరక
బడలంగా నేమి తమకుఁ ♦ బ్రాభవమయ్యెన్
గెడగూడి సతులమాయలు
నుడుగక లోఁబడఁగఁ జేయు ♦ టుచితము దలఁపన్.

కం. తిలకంబు వాలు మందును
దలముడి బాసటముబోలు ♦ తప్పులు నేర్పుల్
గలమావటీని విధమున
జెలఁగక మఱి వారసతులఁ ♦ జెనకఁగ వశమే.

సీ. అడవులఁజరియించు ♦ హరిణశాబకములు
మరపినఁ దిరుగవే ♦ నరుల వెంట
నెట్టనవాకట్టి ♦ పెట్టెలఁ బెట్టిన
నుండవే ఘోరవి♦షోరగములు
వెరవున నొయ్యనఁ ♦ గఱపినపలుకులు
పలుకవే పక్షులు ♦ ప్రతిభతోడ
యంత్రక్రియాయు క్త ♦ నందంద జనులకు
జ్వాలత ప్త లోహముల్ ♦ చల్లగావె

ఆ. వె. తారెఱుంగకున్నఁ ♦ దగవౌనె మందులు
మంత్రములును సురత♦మాయ లౌట
వనితలకును లేవె ♦ వశ్యౌషధక్రియల్
విటులు వలెనటంచు ♦ వెదకిరేని.

వ. ఆమాటలకు భద్రకుం డిట్లనియె.

కం. సుడిగొనెడు నోటిముఱికియు
నుడుగక బలుగోలు వలచు ♦ నొడలుం గలయా
బడుగును గనుఁగొని నంతనె
పొడకట్టక వెఱచిపోవు ♦ భూతములైనన్.

కం. గరగరనై యొల్లప్పుడుఁ
బరిమళముల పొ్రఁకయగుచుఁ • బై వంచనతో
నరవిరి బాగునఁ దిరిగెడు
బురుషులఁ బాయంగఁగలరె • పొలఁతులుజగతిన్.

కం. తలవలువలు పులుమాయక
యెలమిమెయి న్నాఁడునాఁటి • కిగురొత్తంగా
మెలగేఁడుపురుషునిఁ జూచిన
నిలుచుకరయూదృష్టి యెట్టి • నెలఁతుక కైనన్.

ఆ. వె. చివ్వగుణము విడిచి • చిలువెత్తరిటీపు
గానిపించు గాల•గాని రీతి
తెరవతలఁపు మచ్చు • మెఱఁగి యుల్లనఁ దీయ
నేరకున్న యతఁడు • నీరసుండు.

వ. కావునఁ గూరిమిసతులకు నలంకారంబు మూలంబని భద్రుఁ పల్కుటయు దత్తకుం డిట్లనియె.

తే. గీ. రమణి దనయిచ్చఁ గలయు పొం•తియునులెస్స
దాన సౌఖ్యంబుఁ దలఁచుట • గాని త్రోవ
చెఱకు నలినలిగాఁగను • గొఱికి రసము
గ్రోలుజాడల వెలయింపఁ • గోర్కులలరు.

కం. వదనమున నమృతరసమును
హృదయంబున విషమునునిచె • నింతులకు నజుం
డదిగాదె యధర మానుచు
హృదయము తాడనమొనర్తు • రెఱఁగినజాణల్.

కం. ఉల్లివలెఁ బెక్కుపొరలై
నల్లివలెన్ నిద్రఁజెఱచి • నమ్మిన దాఁకన్
బల్లివలెఁ గాళ్ల బెనఁగుచు
వెల్లివలెన్ గడవఁబాఱు • వేశ్య ధరిత్రిన్.

# ద్వితీయాశ్వాసము.

తే. గీ. రణములో దేజ నెక్కుడు ♦ రాతుఁబోలి
యతివ మరుపోరఁ బెల్లార్చి ♦ యంటవేసి
కలయనేర్చిన గోర్కులు ♦ గలయుఁదాఁక
యూరకేలబ్బు మదనసా♦యుజ్యపదవి.

కం. కూరిమి దన మదిఁ గలిగిన
నేరము లెంచంగవలదు ♦ నెలఁతలవలనన్
తోరపు దిరిసెనపూనెన్
సారపు దేనియలు తేలు ♦ చవిగొను నెడలన్.

కం. ధన మీయవలయుఁ దొలిఁ దొలి
జన పీయఁగవలయుఁ బిదప ♦ సరసులు ధరలో
ధనమును జనవును వెలిగా
వనితల లోఁగొనఁగ వశమె ♦ వనజజుకైనన్.

కం. లోభాత్ము నొల్లరతివలు
లోభాత్మునిఁ జేరరెందు ♦ లోకులు ధరలో
లోభాత్ముఁ డుడుగు ధర్మము
లోభం బపకీర్తి నరుని ♦ లోఁబడఁ జేయున్.

కం. ఆకులవార్తలు నమ్మక
కోకలు రూకలును వెలిగఁ♦గూర్తు రటంచున్
గీకలకు వచ్చువిటుగని
కూకలు నత్తులునుగావె ♦ గొంతులమనసుల్.

వ. అని దత్తకుండు పలికిన విటుం డిట్లనియె.

కం. కులసతి సంతానార్థము
నిల దాసీసంగమంబు ♦ హీనము పరకాం
తలు హానియనుచుఁ గాదే
వెలయాండ్రసృజించె నజుఁడు ♦ విశ్వములోనన్.

కం. వెల పుడిగి యిచ్చవచ్చిన
తెలుఁగునఁ గలయంగవచ్చు ♦ ధృతి వారస్త్రీ

చెఱకు నడు మనిన నందున్
గొఱఁతమె యదియనుభవించు ♦ గుణగణ్యులకున్.

కం. దివిజులకును రంభాదులు
భువిజనులకు వారసతులు ♦ భోగాస్పద లీ
యువిదలఁ గూడెడిభాగ్యము
లవిరళపుణ్యులకుఁగాక ♦ యబ్బునె తెలియన్.

చ. క్రతువులు చేసి యాగమని ♦ కాయము లభ్యసనం బొనర్చి సు
వ్రతులగు భూసురోత్తముల ♦ వారితనిర్జరకామినీకుచో
న్నతపరిరంభసౌఖ్యముల ♦ నానల నీనెడి వారకామినీ
రతిఁ ద్యజియించువారలు తి ♦ రస్కృతు లెన్నఁగ ముజ్జగంబులన్

కం. కలయికము లెఱిఁగి విటులం
గలయుచు ఘనమాన మిగులఁ ♦ గఱఁగక ఘనులన్
ఖలులన్ సరిగాఁ జూడక
మెలఁగెడు వారాంగనలను ♦ మెచ్చఁగ వలయున్.

కం. అని విటుఁ డాడిన మాటకుఁ
గనలుచు నాగరకుఁ డనియెఁ ♦ గడకట నేఁడీ
వినరానిమాట నీచే
వినవలసెన్ వీనులందు ♦ వీఱిఁడి భంగిన్.

కం. వాసిచెడు దాసివలనన్
గాసును వీసంబు వేశ్య ♦ కతమునఁ బోవున్,
దోసంబు విధవ, పరసతి
యే సుఖకారిణి యటంచు ♦ నిందుర్గిం డనఁడా.

కం. మగనికి వెఱవక, యింటికిఁ
దగఁదానేకర్త యగుచుఁ ♦ దత్పరవృత్తిన్
వగగలదై, వెలిఁదిరిగెడు
మగువం, గెడగూడువాఁడు ♦ మదనుఁడు గాఁడే.

కం. విను వింతలైన సౌఖ్యము
లనుబొందుచు నెపుడువేడ్క ♦ లనుదనియుచుఁ దా
ననువరియై పను లెడపుచుఁ
గని తిరిగిన నేమిఁ బ్రాతి ♦ కామ్యార్థంబుల్.

వ. అనిన విదూషకుం డిట్లనియె.

ఆ. వె. తొత్తులవలనఁ బోవు ♦ దొరతనం బంతయు
వేశ్యవలన నర్థ♦వితతి యణఁగుఁ
బరవధూటివలనఁ ♦ బ్రాణంబు పై వచ్చు
విధవఁబొంద మేలు ♦ విరహులకును.

కం. స్తంభింపక మరుజలములు
గుంభద్రోణములుగాఁగ ♦ గురియును రతులన్
శుంభల్లీలల విధవా
సంభోగముకంటె వేఱె ♦ సౌఖ్యము గలదే !.

ఆ. వె. అనిన నడ్డగించి ♦ యానొ విదూషక,
తగును మెచ్చ నీకుఁ ♦ దగినవారి
దొరవు చాలుఁజాలుఁ ♦ దొలఁగుమంచు నదల్చి
కొనుచు పీఠమర్ద♦కుండు పలికె.

కం. వాసికిని వేశ్యఁబొందిన
గాసులు చేదిగును సుగతి ♦ గలుగక పోవున్
మీసాలమీఁది తేనియ
దాసియకా కితరజనులఁ ♦ దలఁపఁగనేలా.

కం. వీడియ మడుగదు, గుద్దుల
కోడదు, గాఢంపు రతుల ♦ కులుకదు, కలలోఁ
జూడదు గరగరికలు, మఱి
యీాడా ? దాసికని జగతి ♦ నేకామినులున్.

కం. కాసులు దెమ్మనియడుగదు,
చేసన్నలవచ్చు రతికిఁ ♦ జేరగ నెపుడున్

మూసిన ముత్తెముఁ బోలెడి,
దాసి నుదాసీన మాడఁదగ దెవ్వరికిన్.

వ. అని వీరమర్దకుండు పలికిన పలుకులకు సుశీలుండిట్లనియె.

కం. శ్వేతాదులు కైవల్యం
బాతతమతిఁగనిరి వేశ్యలందునె కాదా
జాతియు నీతియుఁ గలిగిన
యాతెఱవల పొందువలన హానియుగలదే.

వ. అనిన విని మల్హణుం డక్కథ యెఱింగింపుమనిన.

మ. సరసౌదార్యవినిర్జితామరగవీసంతానచింతామణీ
వరపాథోధిశశాంక శాంకరపదద్వంద్వార్చనాసంతతా
దరసంవర్థితగోత్ర గోత్రరిపుసాధారణ్య సంపూర్ణభా
సురభోగాస్పదశోభ శోభనమహాచుండిస్థలగ్రామణీ.

కం. జంభాహితవరకుంభవి
జృంభిత దోరండసత్త్వసింధుగభీరా
శంభుపదపద్మలీలా
బంభరసోమాంబికాతపఃఫలరూపా !

మాలిని

విమతజనవిఘాలా వేదమార్గానుకూలా
శమిత సకల దోషా సాధురక్షావిభూషా
హిమకరసమరూపా యిద్ధబాహాప్రతాపా
సముచిమథనభోగా నవ్యపద్మానురాగా.

గద్యము.

ఇది శ్రీమత్సకలసుకవిమిత్ర సోమయామాత్యపుత్త్ర సరసకవితాధుర్య
యెఱ్ఱయ నామధేయ ప్రణీతంబైన మలహణచరిత్రం
బను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరస్తు.



# మల్హణచరిత్ర.



## తృతీయాశ్వాసము.



శ్రీరంగధామమంగళ
కారణాకరహాటలాట♦కర్ణాటకగాం
ధారనరనాథకృతస
త్కారగుణౌన్నత్య చుండి♦కాళామాత్యా.

వ. అవధరింపుము సుశీలుండు మల్హణున కిట్లనియె.

సీ. అవని నవంతిక♦యను పట్టణంబున
వెలయ శ్వేతుం డను ♦ విప్రుం డొకండు
తలిదండ్రిమాట వీ♦నులం జేర్పం డెన్నండు
గురులయానతి యన్నం ♦ బరుస నౌను
బాంధవు లన్నను ♦ బరిహాసములు సేయు
విద్వాంసు లన్నను ♦ వెక్కిరించు
పెద్దలం గన్నను ♦ బ్రేమముల్ వలుకండు
మానుల బాడగన్న ♦ మండిపడును

తే. గీ. దైవతాంతర మన్నను ♦ దప్పనాఁడు
జపతపంబులు దలఁచినఁ ♦ జప్పరించు
క్రతువులన్నను మాటకె ♦ కల్లలాడు
నతిథులన్నను మండుచు ♦ నడిచిపడును.

సీ. దరిబేసులన్నను ♦ దద్దయుఁ గొసియాడు
కైనులగన్నను ♦ సంతసిల్లుఁ
గుఱ్ఱచ్చితకాండఱన్న ♦ గొండాటములు సేయుఁ
బాషండులన్నను ♦ బరిణమించు
మాతంగులన్నను ♦ మఱిచేరరమ్మనుఁ
బఱుగాకు లన్నను ♦ భక్తిసేయు
భాండికులన్నను ♦ బాయఁ డేప్రొద్దును
గుండగోళకులన్నఁ ♦ గుస్తరించు

తే. గీ. జారచోరులఁగన్నను ♦ సంతసిల్లుఁ
గట్టుపోతులఁ బొడగన్నఁ ♦ గౌఁగిలించు
నేభ్యరాసులఁ బొడగన్న ♦ నిచ్చగించు
దూషకులగన్నఁ దెగబాసి ♦ తోలఁగఁ డెపుడు.

చ. వెలితలబుట్టమందులిడ ♦ వేఁదుఱుబెట్టును జూదమాడ ని
చ్చలు చని జూదకట్ట కడ ♦ సారెకు నొడ్డన కోడిపోరు లే
బలితపుటాటకైనఁ బఱు ♦ పందెము పెట్టును జాగిలంబులున్
వలలు ఘటించి వేఁటసని ♦ వంచనలేక వధించు జీవులన్.

తే. గీ. కుడువఁగూర్చుండి యప్పు డా ♦ కూటికడను
జందె మొకచేతఁ బట్టుక ♦ సంధ్యవార్చుఁ
గాళ్లుచేతులు నెన్నఁడు ♦ గడుగుకొనఁడు
విడుచుఁ గాల్మడి నిలుచుండి ♦ నడచినడచి.

సీ. మరపి సన్న్యాసుల ♦ మాచకమ్మలఁగూర్చి
తలవరులకుఁ జెప్పి ♦ దండుగోర్చ

తివిరికొత్తములొద్దఁ ♦ దీర్ఘవాసుల నిల్పి
పరిహాసములు చేసి ♦ బందుసేయు
వెస దిగంబరులకు ♦ వీర్యంబు గల్పించి
సంతలఁగదియించు ♦ సాధుఁబోలి
పరచుటిల్లాండ్రను ♦ బై కొని బ్రిమయించుఁ
దనుఁదానె భ్రమయించి ♦ ధనము దివియు

తే. గీ. మెరసిపో నింటివారల ♦ మేలుకొల్పి
తవిలి దొంగలచేతికి ♦ దాళ్లనిచ్చి
రూఢిఁదాతను గొంతిగొ♦ట్లాడఁ బెట్టి
నిక్కి తనసీడఁ దనుఁదానె ♦ వెక్కిరించు.

సీ. పాంచరాత్రిక మన్నఁ ♦ బాడును దిరునామ
మరిగూడుకొని యడి♦యఁడ నటంచు
బంతిపబ్బమటన్న ♦ బరువెత్తు బూడిదె
పెంటెకట్టులు చాలఁ ♦ బెట్టుకొనును
కాకొల్లిపరసన్నఁ ♦ గదలును నెదురుగాఁ
దలముఁడి విరఁబోసి ♦ దాటుకొను చు
శివసత్తె దెమ్మన్న ♦ గవ్వదలు మెడనిండఁ
బూత చెందిరమును ♦ బూసి వెడలు

తే. గీ. చెలఁగి రాజులతంతన్న ♦ చిమ్మటరుగు
బడుచుగల పాటఁబాడుచుఁ ♦ బాత్రలాడు
బొలుచు షడ్దర్శనంబుల ♦ పూతకోక
యనఁగఁ జరియించుచుండె స♦య్యావని సురుఁడు.

సీ. వలను మీఱఁగఁ జంద్ర♦వంకతోఁ దిరు నాము
పెట్టి గందపుగీరు♦బొట్టమర్చి
నడుమ విభూతి నిం♦డఁగఁ బూసి యాలోన
జుక్కబొట్టును దిరు♦చూర్ణమునిచి

చిగురుగోళ్లను జాఱు ♦ సిగ నిక్కఁగావేసి
కదలిపూఁతేకులు ♦ గానఁ జెరివి
నెఱికదుప్పటి కొంగు ♦ నేలజీరఁగఁ గప్పి
వెలిదూలగోణాము♦ వేళ్లనిడిచి

తే. గీ. కప్పువెట్టిన మునిపండ్ల ♦ కడలు విడెముఁ
జప్పరింపుచు బెదవులు ♦ సందు కొల్పి
గిరుకు సంబువు కాళ్లను ♦ నొఱయమెఱయ
నిక్కుచును నీల్గుచును వట్టి♦నీటుతోడ.

సీ. జంతలఁగనుఁగొన్నఁ ♦ సరసంబులాడుచుఁ
జెడిపెలఁగనుఁగొన్నఁ ♦ జేరఁ జనుచు
భాండీరులనుగన్నఁ ♦ బ్రాణంబుఁలొసఁగుచు
దాసకాండ్రనుగన్న ♦ నానపడుచు
దేబెలఁ గనుఁగొన్న ♦ వాబల్మిఁ జూపుచు
దాసికత్తెలఁగన్నఁ ♦ దారసిలుచు
దాసిజనముఁగన్నఁ ♦ దకపికల్ వెట్టుచు
దార్గుఁబోతులఁగన్నఁ ♦ దనిసినగుచు

తే. గీ. జారులను గన్నఁ జప్పట్లు ♦ చఱచుకొనుచు
వేశ్యలను గన్న మోములఁ ♦ వ్రేలఁబడుచు
బందెతలఁగన్నఁ గదలక ♦ యండగొనుచు
వింతయునుగన్న దూరంబు ♦ వేగజనుచు.

కం. మరగి కడునప్పురంబునఁ
దిరుగుచుఁ బెనులెస్స దేశ♦దిమ్మరి యనఁగాఁ
బరికించి యెల్లచోటుల
వెరవారగ వెట్టివేసి ♦ విరిసినపిదపన్.

కం. విటతాటకియను లంజెయు
పటలంబడి సొక్కి సొక్కి ♦ నదమదమై తా

నటునిటుఁ బోవను జాలక
చిటిముడి చేఁగానులెల్ల ♦ చెల్లఁగఁ గొఱకెన్.

కం. శతవర్షంబులు వెళ్లిన
యతికష్టపు జంతగాన ♦ నదియున్ వానిన్
గతిచెడి నవ్వక పిలువఁగ
బతిచెడి యయ్యింతి పొందుఁ ♦ బాయక యతఁడున్.

చ. మునుకొని పట్టుగొఱ్ఱియల ♦ ముగ్గిచ్చిలి రాతుగ్గలఁ దెచ్చియిచ్చు నో
య్యనఁ దెరవాటుగొట్టి కల♦యర్థము దానికిఁ బెట్టు కావటం
గనలుచు రేయునుం బగలుఁ ♦ గట్టెలు నీళ్లును మోచు పారునే
పనులకుఁ దానె పంచఁగల ♦ పాటులనుంబడు నెల్లభంగులన్.

చ. తటతట దంతకాండములుఁ ♦ దాఁకగఁ బ్రిక్కలు వీపు వంపఁగా
జొటజొట నీళ్లుముక్కులను ♦ జూడ్కులఁ గ్రమ్మఁగఁ గాళ్లుఁజేతులున్
చుటచుట గోరబోర నెటు♦చూచినఁ బానగు శీతవేళలన్
దుటదుటఁ బాఱుచున్ బనులు ♦ దూకొనిచేయును దానికెప్పుడున్.

ఉ. ఎండను భూమి వత్సలయి ♦ యెల్లెడ శేషఫణామణి ద్యుతుల్
గాండకరప్రభం బెనుపఁ♦జాలి తృణంబు తరుప్రకాండముల్
మండఁగఁ బొట్టయుం దలయు ♦ మాఁడఁగ నిప్పులుచల్లు వేసవిన్
కొండల కేఁగి యాకలముఁ ♦ కూరలుఁ గాయలు దెచ్చు దానికిన్.

చ. పిడుగులు వ్రేసి నల్గడల ♦ ప్రేలిపడన్ బెనుగాలి రువ్వనన్
సుడివడఁగొట్ట మేఘములు ♦ జోరున బాములు వ్రేల గట్టిన
ట్లుడుగక మిన్ను దూటుపడె♦నో యన బెన్జడివట్టి మోదఁగా
జడియక వానకాలమున ♦ సారెకుఁజేయును దానికిం బనుల్.

కం. తలమొడ తెఱుఁగక యీ గతి
వలచికడుం దిరిగి దాని ♦ వలఁబడి దానిన్
నిలుకాల నిలువఁదీఱక
మెలఁగంగా నొక్కనాఁడు ♦ మెలఁతుక యంతన్.

కం. తలకడక యర్ధరాత్రిం
బలరఁగ నయ్యమ్మపూజ ♦ కలరులు దేవా
తలఁప వనవుడును, దానికిఁ
దలఁకుచుఁదానుండి నిచట ♦ దాఁచితిననుచున్.

ఆ. వె. పాఱినగరితోఁట♦పైఁ గావ లున్నట్టి
వారికన్ను మొరగి ♦ బీరమునకు
కోట వెలుగు బోకి ♦ గొబ్బున దిగజాఱి
విరులు చాలఁ గోసి ♦ వెడలిమగుడి.

కం. తడవాయె ననుచుఁ గామిని
కడుఁ దిట్టునొ మిన్న కేనిఁ ♦ గట్టునొ కొడిమల్
వడి నేమిసేతు నిఁక నని
వడి దప్పకయుండె నతఁడు ♦ పరుగునరాగన్.

కం. మంకుతనంబున హేయపుఁ
బంకములో నొక్కపూవుఁ ♦ బడుటయు దానిన్
శంకించి తివియ నోడుచు
శంకరు కర్పణమటంచుఁ ♦ జనియెను వేగన్.

వ. చని ముందటంబెట్టిన మండిపడి యింతతడవుండుట కేమినిమిత్తంబు, అపవిత్రజన్మంబునం బుట్టిన నిన్నుఁ బావనునిజేసితి కృతఘ్నుండవై మఱచితే యని యదల్చిన నతండును గజగజ వణంకి యియ్యపరాధంబు సహింపుమని పదంబుల కెరఁగిన శిరంబుఁదన్ని విదల్చుకొనుచుఁ గోపావేశంబుననుండె నంత వనపాలురు మేలుకాంచి తలవరుల కెఱిఁగించిన.

కం. కొలకొలన పట్టు నేచని
యిలుచుట్టుక వాని దాని ♦ యిలఱేనికడన్
తలవరులు నిల్పి వారల,
దలిరులునుం దెచ్చి చూపఁ ♦ దగునే యనుచున్.

కం. ఇలఁ దిట్టుకొంచు మోదుచు
నులుకం గదియంగఁ గనలి ♦ యుద్యానము లో
పలి కెట్లు వీఁడుచొచ్చెనొ
తలఁ కించుక లేక యనిన ♦ ధరణీశుండున్.

ఆ. వె. చంపవలదు వీండ్రి ♦ సర్వస్వమును గొని
విడిచి యుప్పురంబు ♦ వెడలఁదోలియుఁ
డనినఁ దలవరులును ♦ నట్ల వారలచేతి
విత్తమెల్లఁదోఁచి ♦ వెడలఁదోలియ.

కం. అర్థము తను గడియించును
నర్థంబును దాఁ గడించు♦నది యాయన కా
వ్యర్థంపు ముండ యూరకె
యర్థమునకుఁ బొగిలిపొగిలి ♦ యసువులుతొలఁగెన్.

వ. అంత నతండును దద్వియోగవేదనం గ్రాఁగి శరీరంబు దొఱంగుటయు యమకింకరులుం బఱతెంచి వానిఁబట్టుకొని పోయి జమునిముందటం బెట్టిన బిట్టుమిట్టిపడి యతండును.

తే. గీ. చిత్రగుప్తులఁ బిలిచి యీ♦చెదుగు చేసి
నట్టిదోషంబు లేమేమి♦యనిన వారు
కవిలె వీక్షించి వానిపైఁ ♦ గనలిపడుచు
దేవ వినుమని చెప్పిరి ♦ తేటపడఁగ.

సీ. పశుహత్య లన్నను ♦ బదునేడులక్షలు
స్త్రీహత్య లన్ననుఁ ♦ జెప్ప నరిది
శిశుహత్య లనిన నెం♦చెదము మేమనరాదు
బ్రహ్మహత్యలు వే ల♦పరిమితములు
నర్బుదంబులు దాటు ♦ నటు భ్రూణహత్యలు
చౌర్యవర్తనములు ♦ సంఖ్య గడుచు

పరదార సత్వముల్ ♦ పరికింప మితి లేవు
తక్కుదోషంబులు ♦ లెక్కలేవు
ఆ. వె. కడలి తరఁగలైన ♦ నుడుగణంబైనను
నిసుకరాసులైన ♦ నెంచవచ్చు
వీఁడుచేసినట్టి ♦ వివిధపాతకములు
తలఁప బ్రహ్మకైనఁ ♦ దరము గాదు.

వ. అనుటయు దండధరుండు మండిపడి వానింజూచి నిజకింకరులతో నిట్లనియె.

సీ. పరసతిపై దృష్టి ♦ పఱపినఁ కన్నుల
నెఱ్ఱఁగాగినయట్టి ♦ యినుముఁబోయుఁ
డితరాంగనలయిండ్ల ♦ కేఁగిన పదముల
నాటుఁడు కొఱ్ఱవ్రేడి ♦ నారసములు
మొనసి యొండులసొమ్ము ♦ ముచ్చిలుచేతులఁ
బోనుపుండుసూదులు ♦ మనిపి నినిపి
యన్యకాంతలచన్ను ♦ లానినయురమున
నెత్తుఁడు కరఁగిన ♦ యినుపముద్దఁ
తే. గీ. జేరి కొండెంబు నొరులకుఁ ♦ జెప్పినట్టి
జిహ్వఁగత్తుల నింతింత ♦ చీఱి విడుఁడు
మించి యన్యాయవిత్త మా ♦ ర్జించినట్టి
కుటిలదేహంబు అంపానఁ ♦ గోయుఁ డిపుడు.
తే. గీ. ఇతరకాంతలఁ దనతోడ ♦ నిచ్చగించి
యుపరిసురతంబు సలుపంగ ♦ నొడ్డుకొన్న
యల్లచోటులఁ గ్రాఁగిన ♦ యట్టి లోహ
పాత్రి నెత్తుఁడు కడుఁగ్రాఁగి ♦ భస్మముగను.
ఉ. పట్టుఁడు కారులం దవుడ ♦ పండులు డుల్లఁగవ్రేసి సంపెటన్
గొట్టుఁడు కర్పటంబవియ ♦ గ్రుద్దుల దొబ్బుఁడు చిల్లఁగోలలన్

గుట్టుఁడు గొంతుగోల ముకు♦గోళ్ళను మొత్తుఁడు తప్తలోహముల్
చట్టనఁ జీఱి పొట్టసిడి ♦ చర్మముఁ దీయుఁడు తిత్తి దోఁపుడున్.

వ. అనుటయు దేవా! యితం డొక్కనాఁ డర్ధరాత్రంబున వేశ్యకుం బూవులు గొనిపోవునెడ నపాత్రస్థలంబున నొక్కపుష్పంబు పడిన నది తన కుం గొఱగామి శివార్పణంబు చేసెనని చెప్పిన మహాభుజంగంబునకు బజ నిక చూపినట్టుం బలె నమ్మాటకు నుపశమించి యతని నీరాత్రి రంభా సంభోగంబు చేయించి పిదప దండంబున దండింపుఁడనిన వారలు దండ ధరు నానతిం జని యావృత్తాంతంబంతయు నెఱుంగ రంభ కొప్పంజెప్పిన నారంభయు నతని యభ్యంతరగృహంబునకుం గొనిపోయి.

తే. గీ. హంసతూలికపాన్పుపై ♦ నతని నునిచి
యుచితగోష్ఠుల మెల్లనె ♦ హృదయ మెఱిఁగి
యిష్ట మొనరించి యధిక సం♦తుష్టుఁ జేసి
బుద్ధి చెప్పంగఁదొడఁగె న♦ప్పువ్వుఁబోఁడి.

కం. దేవాదిదేవు మదిలో
భావించి భజింతు వేని ♦ భక్తి నెలంగన్
నీవంక నైనఁ జూడం
గా వెరతురు కాలుభటులు ♦ గడుభీతి మదిన్.

కం. ఒకపుష్పము సర్వేశ్వరు
నకు నిడి కాంచితివి నీవు ♦ నవ్యసుఖం బి
ట్లకటా శివు నర్చించినఁ
బ్రకటంబుగఁ బడయరాని ♦ పదవులు గలవే!

కం. ఈయింద్రుఁ డీ కుబేరుం
డీయసురపుఁ డీయగస్త్యుఁ ♦ డీపద్మభవుం
డీయురగశాయి మొదలుగఁ
గాయజహరుసేవఁ గాదె ♦ ఘనులై రెపుడున్.

కం. అన రంభతోడ వాఁడి
ట్లను నా కివియేల యింక • నతివా, స్త్రీతో
డనుగూడు సౌఖ్యమునకును
బ్రణుతింపగ నజహరీంద్ర•పదవులు సరియే ?

వ. అనుటయు రంభ వానితో నిట్లనియె.

ఆ. వె. ఉలికె తెర్పిడ్డనాకి • యుపవాసముడిగిన
ల్లోల చిన్నపనికి • నింతవినఁగ
హరుని నాల్గుజాము • లర్చింపు మఖలసౌ
ఖ్యములు దాన నీకు • నబ్బుఁగలవు.

కం. నావంటివార లెప్పుడు
నీవెంటన్ దిరుగ బ్రతుకు • నీకయ్యెడు న
న్నీవెంట నీవెలింటను
మీవెంటన్ దిరుగ మాకు • మే లగుఁ గాదే.

ఆ. వె. సౌఖ్యమనుభవింప • సంతతపుణ్యంబుఁ
బోవు మూలధనము • పోయినట్లు
వరుసఁ బుణ్యధనము • వర్ధిల్లునట్లుగా
నిత్యసౌఖ్య మంద • నేర్చు టురవు.

కం. నను గౌఁగిలించుసౌఖ్యము
నిను వించుక యొుండె నేని • నిముస మెగద ! కా
వున నీ తరుణములోనసె
విను మది పో కుంక నిలిపి • వేడుము శివునిన్.

ఆ. వె. మలముఁ దోలునెమ్ము•కలును శ్లేష్మంబును
మొదలుగాఁగనైన • ముఱికి డొక్కఁ
జూచి లంజెలెల్లఁ • జొక్కుదు రూరక
యిందువలన సౌఖ్య•మేమిగలదు.

ఆ. వె. జనకునాన నీదు ♦ జననియితి మీఁదాన
ప్రాణసఖునియాన ♦ భర్గునాన
గురువులాన శంభుఁ♦గొలువవే యనవుడు
మూర్ఖుఁ డతఁడు చెవులు ♦ మూసికొనియె.

ఆ. వె. అపుడురంభ సూచి ♦ యల్లన నవ్వుచు
నూరకున్నఁ బలికె ♦ వారిదాసి
శ్వేతమయ్య, చనవుఁ ♦ జేకొను నామీఁది
యాన సేయవయ్య, ♦ యక్కమాట.

ఆ. వె. వెఱచి యుల్కిపడుచు ♦ విదలించుకొని లేచి
యింతమాత్రమునకు ♦ నింతయనినఁ
జెప్పు మేమియైనఁ ♦ జేసెద నీమాట
యనిన రంభ పలికె ♦ నతనితోడ.

కం. అచలస్థితి బాహ్యాంత
శ్శుచివై యీనాల్గుజాలు ♦ సోమార్ధధరున్
రుచితోఁ బూజింపుము కృ
ష్ణ చతుర్దశి సలుప మేలు ♦ జాగరమునకున్.

కం. పరమేశునాఁటి రాత్రిన్
బరికించినఁ దమకు నిలువఁ ♦ భార మటంచున్
దురితంబులు నిద్రాకృతి
సురమునిముఖ్యులకుఁ నైనఁ ♦ జూడ్కులఁ గ్రమ్మున్.

వ. అని చెప్పి రుద్రాక్షభూతిభూషణుం గావించి నిజోద్యానమున నున్న శివలింగంబునకు మ్రొక్కించి గంధపుష్పాక్షతలు, ధూపదీపనైవేద్యంబులు సమర్పించి సర్వేశ్వరున కర్పించుమని యతనికరంబున కొండొండ యందిచ్చుచుం బ్రియంబున.

సీ. అర్కపుష్పంబుల ♦ నభవునిఁ బూజింపఁ
బరధనాహార మహా♦పాపమణఁగు

దూర్వాంకురంబుల ♦ శర్వునిఁబూజింపఁ
బరసతీసంగమ♦పాప మణఁగు
తులసీదళంబుల ♦ ధూర్జటిఁ బూజింపఁ
బరనిందచేసిన ♦ పాప మణఁగు
మారేడుదళముల ♦ మఱి శివుఁబూజింప
బ్రహ్మహత్యాదిక ♦ పంకమణఁగు
అష్టగంధంబుల ♦ నభవునిఁ బూజింపఁ
బరహింసనక్రియా♦పాపమణఁగు

తే. గీ. ధూప మర్పింపఁ గలుషని♦ర్ధూమకరము
దీప మర్పింప నజ్ఞాన♦తిమిర మణఁగు
నక్షతలఁ బూజసేయఁ గా♦మ్యార్థమొదవు
భవుని భావింప సాయుజ్య♦పదము గలుగు.

కం. వెలిదమ్ములఁ గెందమ్ములఁ
గలువలఁ జెంగల్వవిరులఁ ♦ గాంచనములఁ దు
మ్మల మఱి దుత్తూరంబులఁ
గలయఁగఁబూజింపు మఖిల♦కలుషము లణఁగున్.

కం. విమలంబుగ నైవేద్యము
నమరఁగ సర్వేశ్వరునకు ♦ నర్పించిన రా
జ్యము గల్గు వీడియమ్మున
నమితంబుగ సౌఖ్యమొదవు ♦ ననవరతంబున్.

ఆ. వె. అనఁగ నతఁడు శివుని ♦ నట్లు నాలుగుజాలు
నోజ మేలుకాంచి ♦ పూజసేయ
వేగ వచ్చినంత ♦ వేవేగ జముభటుల్
వచ్చి రంభ యింటి♦వద్ద నిలిచి.

—♦ మత్తకోకిల ♦—

నిన్న నేమిట నప్పగించిన ♦ నీచుఁ డెక్కడనున్న వాఁ
డన్న వారలతోడ రంభయు ♦ నల్లవాఁడని చూపినన్
కన్ను విచ్చియుఁ జూడ భీతిలి ♦ కంపమొందుచు నేఁగియా
నన్నవర్తనుఁడైన కాలుని ♦ సమ్ముఖంబునఁ జెప్పినన్.

తే. గీ. జముఁడు మండుచు వానిపైఁ ♦ జంప నలిగి
యరుగుదేరంగ శివదూత ♦ లతనిఁ బిలువ
వరవిమానంబుఁ గొంచును ♦ వచ్చుటయును
జూచి వెఱఁగంది మదిఁ గుంది ♦ చోద్యమంది.

కం. భూతపతియాజ్ఞఁ దప్పిన
నాతత మఱఁ డల్లవచ్చు ♦ నగు, నేమిటి కీ
పాతకున కర్త నేటికి
నీ తెఱఁ గెఱిఁగింపుఁ డనిన ♦ నెంతయు వారల్.

కం. శివరాత్రి నాల్గుజాలును
శివునిం బూజింప నొండె ♦ శివనామంబుల్
శివలాంఛనములు దాల్పను
శివుఁ డతఁడే కాక మర్త్య♦జీవుఁడె చెపుమా.

వ. అనవుడు నప్పుముండు శివదూతలతో మును మార్కండేయునికై శివునిచేతం బడిన పాటులేచాలు మీమహత్త్వంబు నెవ్వ రెఱుంగం జాలుదు రని నమస్కరించి జముండు నిజస్థానంబున కరిగె నంత నా శ్వేతుండును విమానారూఢుండై శివునిసన్నిధికిం జని సాష్టాంగ దండప్రణామంబు లాచరించినం జూచి సర్వేశ్వరుం డతనికిఁ బ్రమథ పట్టణంబుఁ గట్టెం గావున నుత్తమగుణంబులుగల వారాంగనలం గలసినవారలకు మోక్షంబు సిద్ధింపకుండునేయని సుశీలుండు చెప్పిన విద్యానిధియు నది యట్ల తప్పదని యందఱ నుపచరించి పొందనియనిపిన వారును మలహాణుండును జను దెంచి రంత.

కం. ప్రాచీవధూలలామ ప్ర
తీచీ సతిమీఁద నగవు • దీపింపంగా
వైచిన మణికంకణ మనఁ
బ్రాచుర్యస్ఫురణఁ దరణి • పడుమటఁ బ్రాలెన్.

కం. ఇనుఁ డపరజలధి శశి తూ
ర్పునఁ దోఁచిరి గెంపువడలి • పొలుపొంద నభం
బనుదంతికి నిరువంకల
గనకఘ్రుఘంటికలు సురలు • గట్టిరొ యనఁగన్.

కం. వలిచెంగావులుఁ గపురపు
గుళికలు పరితాప మణఁచు • కొఱకై దివిజుల్
మలహాణు కొనగూర్చిరొ యన
నెలకొనె సీరసముతోడ • నింగిం జుక్కల్.

మ. అట కాంచెన్ ధరణీసురుండు నవసం • ధ్యావేళ వేలాగ్రప
ర్యటనేందీవరసాంద్రకందళమరం • దానందధారావళీ
నటదిందిందిరబృందతుందిలసదా • నందేందిరావందివి
స్ఫుటగానామృతసారసారముఁ గన • ద్భూసారకాసారమున్.

చ. వ్రతమున లోన దేఁటి యను • పట్టె ముకుళించెడి తమ్మియొప్పె నా
రతి సఖిసిం బరండి వల • రాజు రవాజు రథాంగరావముల్
హితమతి నేకతంబ తగ • నిందిరన ర్తనశాల యానిశా
పతి చెఱఁజిక్కి కూయు పసి • బాలికఁ బొంద వధూటియో యనన్.

సీ. ఇంచుపయ్యెద కేవ • నించుక గాన్పించు
శచిదేవి దాపటి • కుచ మనంగ
విరహులపై దండు • వెడలంగఁ దమకించు
వలరాజు కెంపుగో • వడ మనంగ
ఘనజగన్మోహన • గంధచూర్ణం బిడ
రంజిల్లురత్నక • రండ మనఁగ

నమరేంద్రముఖ్యు లయ్యను గోరిలనిచ్చిను
గొమరారు నమృతంపుఁ గుంభమనఁగఁ

తే. గీ. గాయసిద్ధికి సిద్ధసంఘంబు లెల్లఁ
గూర్చుసిద్ధరసంబుల ఘుటికయనఁగ
నమరు రతిదేవి మెఱుఁగుటద్దమొ యనంగ
నిందుఁ డుదయించె లోచనానందముగను.

వ. అంత నామలహాణుండును సంధ్యాదికృత్యంబులు దీర్చి పుష్ప సుగంధిందలంచి సుశీలుతోడ నిట్లనియె.

కం. ఉడుగని విరహానలమునఁ
బడి వడిఁ గడునొచ్చి మిగుల బడలినవారిన్
గెడగూర్చుకంటెఁ బుణ్యము
వడిఁ బాపఁ దలంచుకంటెఁ బాపముఁ గలదే.

తే. గీ. విరులు గంధంబు మిగులను వెట్ట యగును
చెలులమాటలు చెవులకుఁ జేఁదులగును
ప్రాణపద్మైన యంగనఁ బాయుకంటె
మఱియు దుఃఖఁబుగలదొ యిమ్మహిఁ దలంప.

ఉ. మక్కువఁ బుష్పగంధి పురమర్దనుసన్నిధి నాటలాడి తా
నిక్కువ కేఁగుదేరఁగ రతీశ్వరు పట్టపుటేనుఁగో యనన్
జెక్కుల మించు తేజమును సిబ్బెపుగుబ్బలు మందయానముల్
చొక్కపుఁ గాంచికారవముసొంపును నామదిఁ బాయదెప్పుడున్.

చ. నిలిచినయట్టితావునను నిల్వఁగ నైఁపదు డెంద మెంతయున్
గలచినయట్టు లయ్యెడును గంటికి నిద్దురరాదు దేహమున్
గొలుపక లేచిన ట్లగుచుఁ గ్రుమ్మరిలంగను నైఁపవచ్చునే
కలదొకొ పుష్పగంధి నిఁకఁ గన్గొనుభాగ్యము నాకు నిమ్మెయిన్.

వ. అనుటయు సుశీలుండును మలహాణునిం జూచి పుష్పగంధి జన యిత్రిహృదయం బరసివచ్చెదఁ జింతింపకుండుమని యతిరభసంబునం జని మదనసేనం గనుంగొని యిట్లనియె

కం. ధనము గడియింపవచ్చును
విను మెవ్వరికైన మంచి♦విద్యయుఁ బుణ్యం
బును గీర్తిగలుగుఁ బొందులు
వనితా, ఘటియింపరాదు ♦ వసుమతిలోనన్

కం. మలహాణ పుష్పసుగంధులు
వెలయంగాఁ గూడి చదువ ♦ పేనుల కింపై
యలవడు పరమానందము
తలఁపఁగ నిపుడేల పాసి ♦ తక్కరో, యనిసన్.

కం. నెట్టుకొని పట్టి మాయలఁ
బెట్టకుమీ నీవు మాను♦పిల్లలకూఁతల్
పుట్టించి, వేయుమాడలు
వెట్టక మరుగైనఁ బూట ♦ పిల్వఁగ నీయన్.

ఆ. వె. కుదువఁ గట్టలేదు ♦ కొండిక తనవంక
వట్టి నింద పడఁగ♦వలసె నుఱుక
చదువు దమ్మ్య మెఱుఁగుఁ ♦ జాలును బదివేలు
వచ్చె నటనిపొందు ♦ వలదు మాకు.

కం. మలహాణు సుద్దులు చెప్పను
తలఁపఁగ వెనుకటివె చాలుఁ ♦ దక్కనవేమో
తెలుపుము పురిలో వార్తలు
కలిపోసిన నుట్లవంకఁ ♦ గనుఁగొనఁ దగునే.

ఉ. ఎక్కినవానికిం గుఱుచ♦యేనుఁగటన్న విధంబు దా మదిం
బొక్కుచు నల్లనాఁటి మన ♦ పుష్పసుగంధి యటంచుఁ జూచెనో

మక్కువగల్గెనేని వెడ • మాటలు మాయలు మాని గ్రక్కునన్
రొక్కము వేయుమాడ లిటు • రోవెలఁ దెమ్మను మొక్కపూటకున్.

వ. అనుటయును సుశీలుండు పుల్లసిల్లి యేదియు నాడలేక మగుడం జనియె. పుష్పగంధియుఁ జాలమార్గంబునం జూచి పురపురం బొక్కుచున్న నతిమూర్ఖుండైన యన్నా వైశ్యుండును.

సీ. మొగము త్రిప్పకుండినఁ • దగిలి పీడియమింద
యనుచుఁ జేతులువట్టి • యదుముకొనును
జూడ కూరకయున్న • సుద్దు లేమందువు
చెప్పుమంచును మీఁదఁ • జేయివేయుఁ
బలుక కూరకయున్న • బాపురే నీవలెఁ
బండుకోరాదని • పట్టుఁ జెయ్యిఁ
గదియ కూరకయున్నఁ • జదువులు చదువుచు
నిది మేలుకాదని • యెత్తుకొనును

తే. గీ. గన్నుమూసిన పొట్టిరా • గాలు సేయు
నదరిపడి మిన్నకేనియు • నావులించు
నిదురవోనీఁడు మేల్కని • నిలువనీఁడు
వెలికినేఁగిన దానును • వెంట నరుగు.

కం. నిలుకాలనిలువనీయక
కలుషాత్ముఁడు బాధపెట్టఁ • గా విధి నాత్మన్
బలుమాఱు దూఱుఁ గోమటి
కొలమెక్కడ గలిగెనంచుఁ • గుందుచునాత్మన్.

సీ. మందులు పెట్టితో • మఱగి మాపటినుండి
గుండె ఁదీసినదనుఁ • గొంతతడవు
పైత్యంబుగానోపు • బగబగమనుచునో
కొలుపుచున్నది యను • కొంతతడవు

తలనొప్పి ఘనమోరి ♦ తల యారదోయని
కూఁతలు పెట్టును ♦ గొంతతడవు
కనుదృష్టి దాఁకఁబో♦లును నాకు నని యావు
లింతలు వెట్టును ♦ గొంతతడవు

తే. గీ. కడుపులోనంటుసొంటేమొ ♦ వడిగ నిపుడు
కుట్టుచున్నది యనుచుండుఁ ♦ గొంతతడవు
తివిరి దయ్యంబు పట్టెనో ♦ దేహమునకు
గుణముగా దనుచుండును ♦ గొంతతడవు.

కం. పుటపాకంబగు వేదన
నెటువలె సైరింపవచ్చు ♦ హృదయేశ్వరు కాఁ
గిట సౌఖ్యజలధిలోపల
నటయంతయుఁదెలియ నోల♦లాడక యున్నన్.

కం. బెడిదమగు విరహవేదన
వడివేగఁగ పీనిచేత ♦ బాధయు నయ్యెన్
వడి గోరుచుట్టుమీఁదను
నడరఁగ రోఁకంటిపోటు ♦ ననుచందమునన్.

కం. అసియాడెడు నెన్నడుమును
వసివాడిన దేహలతయు ♦ వాడినటెప్పల్
దెసలాలకించువీనులు
కసుగందిన నెమ్మనంబుఁ ♦ గదురఁగ నంతన్.

కం. అలుగుచు నలుగుచు గలఁగుచు
నలికుంతల వాసిబాధ ♦ నటువడుచుండెన్
పులిచేత చిక్కుపడి మదిఁ
గొలుపక పొరలాడు జింక♦కొదమయుఁ బోలెన్.

వ. ఇట్లు పుష్పసుగంధి వేగించుచుండె నంత నక్కడ సుశీలుండును జని మలహాణుం గనుంగొని మదనసేనయాడిన కర్ణకఠోరవాక్యంబు లించు కించుక సూచించిన నతండు నిట్టూర్పు నిగుడించి యిట్లనియె.

సీ. ఏనేల చదివితి ♦ నెలతఁ గేఁబోఁడితోఁ
గవగూడి చదువెల్లఁ ♦ గడమలేక
చదువుదుఁ గాకేమి ♦ జలజాస్య దానేల
నాతోడునీడయై ♦ నడవఁ దొడఁగె
నడవఁగాకేమి నా ♦ నయనచకోరంబు
లిందుబింబాస్యపై ♦ నేలవ్రాలె
వ్రాలెఁ గాకేమి యా♦వనితకు నాకును
హృదయంబు లవియేల ♦ నేకమయ్యె

తే. గీ. అయ్యె, నైనను గాకేమి ♦ యలమృగాక్షి
కకట, యెలప్రాయ మదియేల ♦ యలముకొనియె,
నలముకొన్నను గాకేమి ♦ చెలియ నన్నుఁ
బాతకపుదైవ మిట్లేల ♦ పాయఁజేసె.

సీ. కానంగ గలదొకో ♦ కమలాయతాక్షిని
గలలోననైనను ♦ గన్నులార
నానంగఁ గలదొకో ♦ హంసేంద్రగామిని
చనుదోయి యురమునఁ ♦ జాదుకొనుచుఁ
గ్రోలంగఁ గలదొకో ♦ గురునీలకుంతల
యధరామృతముచవు ♦ లాత్మఁ దనియ
భావింపఁగలదొకో ♦ భామాలలామతో
నసమానరతికౌశ♦లానుభవము

తే. గీ. వినఁగఁగలదొకొ యొకనాఁడు ♦ వీనులలరఁ
దరుణి మునుబోలె శంభుగీ♦తములు పాడ

నిలువఁ గలదొకో యొకనాఁడు ♦ నెలఁతఁగూడి
లీల మెఱయంగ నంగజ♦కేళిఁ దేల.

సీ. అంగనమధురోక్తు ♦ లాలకించినఁగాని
వీను లన్యులమాట ♦ వినఁగ రోయు
వెలఁదివిలాసంబు ♦ వీక్షింపనే కాని
చూడ్కు లన్యంబును ♦ జూడరోయుఁ
గలకంఠి తనువల్లిఁ ♦ గౌఁగిలింపనె కాని
తనువన్యకాంతల ♦ దాయరోయు
జలజాక్షి కెమ్మోవి ♦ చవి యానసే కాని
జిహ్వ యన్యంబు రు♦చింపరోయుఁ

తే. గీ. చిత్త మన్యులఁ గలసె నఁ ♦ జేరరోయుఁ
గోర్కు లన్యంబు లెవ్వియుఁ ♦ గోరరోయుఁ
దలఁపు లన్యంబు లెవ్వియుఁ ♦ దలఁపరోయుఁ
గలదొకో సుమగంధిని ♦ గలయు నాకు.

కం. వనిత నెడబాయఁజాలక
తనువున నిడుకొన్న శివుడు ♦ తా సర్వజ్ఞుం
డనయము నొందులతనువులు
తనవలెనే సేయకునికిఁ ♦ దగవా తనకున్.

తే. గీ. వెలఁదికిని నాకుఁ బొందులు ♦ వేఱుసేసి
ప్రాణములు వేఱుచేసెను ♦ బాపజాతి
బ్రహ్మ యిరువురి తనువులుఁ ♦ బ్రాణములును
నేకముగఁ జేయఁడాయె నిం♦కేమి గలదు.

కం. వేడుకఁ బుష్పసుగంధిని
గూడుండేనాళ్లవలెను ♦ గొనకొని యాత్మన్
గూడుకొనె నొక్కలెక్కను
నీడుగ నలతమ్మిచూలి ♦ యీ దివసంబుల్.

ఉ. చొక్కపు ముద్దునెమ్మొగము ♦ సోగమెఱుంగుసు నోరచూపులుఁ
జిక్కని గుబ్బచన్నులును ♦ జెల్వగు నీనరరూపమై భవం
బక్కట నామనోంబుజము ♦ నంటు సమస్తము డించి యొంటి నీ
వెక్కడనున్న దానవు మృ♦గేక్షణ, పుష్పసుగంధి, చెప్పవే.

ఆ. వె. కన్ను విచ్చినపుడు ♦ కాన్పింతు మనసునఁ
గన్నమూయ నెదుటఁ ♦ గదలకుందు
పట్టఁ జిక్కవడవు ♦ ప్రాణేశ్వరీ, యింత
యింద్రజాలవిద్య ♦ యెఱిఁగితెట్లు.

సీ. నీముద్దుమాటలు ♦ నిరతంబు వినఁగోరి
తవిలి నావీనులు ♦ తపము సేయుఁ
నీగుబ్బచన్నులు ♦ నెమ్మిఁ గౌఁగిటఁ జేర్పఁ
దవిలి నాహృదయంబు ♦ తపము సేయుఁ
జక్కని నీమోవి♦చవి యానఁగాఁగోరి
తవిలి నానాలుక ♦ తపము సేయు
నీ మోహనాకృతి ♦ నిరతంబుఁ జూడంగఁ
దవిలి నాకన్నులు ♦ తపముసేయుఁ

తే. గీ. నీవిలాసంబు నాయాత్మ ♦ నెలవుకొల్పి
తలఁపులన్నియు నినుఁగోరి ♦ తపముసేయుఁ
బ్రాణములకును శాంతిణమై ♦ పరగు నీవు
ఉవిద, నినుఁబాసి యెబ్భంగి ♦ నోర్చువాఁడ.

సీ. అంబుధి దావాగ్ని♦కైన నోర్చునుగాని
యోర్వలేదు నదీవి♦యోగమునకు
నబ్జారి రాహువు♦కైన నోర్చును గాని
యోర్వఁడు తారాసి♦యోగమునకు

హరుఁడు హాలహలాగ్ని ♦ కైన నోర్చునుగాని
యోర్వఁడుగౌరీవి ♦ యోగమునకు
నభ్రంబు పిడుగుల ♦ కైన నోర్చునుగాని
యోర్వలేదు తటిద్వి ♦ యోగమునకు

తే. గీ. నతనుఁ డీశ్వరునయనాగ్ని ♦ కైన నోర్చుఁ
గాని యోర్వఁడు రతివియో ♦ గంబునకును
విశ్వభయదోగ్ర నిర్వ్యగ్ర ♦ విరహవహ్ని
నువిద నినుఁబాసి యేభంగి ♦ నోర్చువాఁడ.

ఉ. చక్కవ లుక్కడక్క జల ♦ జంబులు స్రుక్కఁ జకోరరాజియు
న్నొక్క వియోగు లుక్క లెటి ♦ నీశుఁడు నిక్క మనోజుపంతముల్
దక్క ముదంబు కెక్కఁ గుము ♦ దంబులు చొక్కఁ దమంబు మక్కన
చుక్కల ఱేఁడు వేఁడిమిదె ♦ చూపెఁగదే వసిఁ బ్రాణనాయికా !

ఉ. హాలహలంబు గ్రిమ్మఱ ను ♦ దగ్రతఁ బుట్టెనొ చండభానుఁ డా
ఫాలత నన్నిమూర్తులను ♦ భీకరభంగిని గాయఁజొచ్చెనో
గాలుని తీవ్రమౌ ప్రళయ ♦ కాలమహానల మేఁగుదెంచె నో
ఓలిమిఁ జంద్రరోచు లిటు ♦ లుండునె చూడ్కికిఁ బ్రాణనాయికా !

చ. ముదిరిన సాంద్రచంద్రికలు ♦ మొత్తపుచంచుపుటంబులందిడిఁ
గుదిలిచి చించి చీఱి కడుఁ ♦ గ్రొవ్విన వెన్నెలగుజ్జు ముక్కునన్
ముదితల కందియిచ్చుచుఁ బ్ర ♦ మోదము నొందెడు నాచకోరముల్
కదిసిన నీదుకన్నుల వి ♦ కాసము దోఁచెను బ్రాణనాయికా !

ఉ. వాలికలై మనోజభవు ♦ వాలికలై సరసాళిచారు దృ
క్కేలికలై చకోరముల ♦ కేలికలై కమలాలిహల్లకో
న్మాలికలై సుగంధవన ♦ మాలికలైన భవన్మనోజ్ఞ దృ
గ్జాలికలీనఁ జేసి మది ♦ జాలిఁక మాన్పుము ప్రాణనాయికా !

ఉ. ఇక్కలి దక్కి నిక్కి మెఱుఁ♦గెక్కి మొగెక్కి బిగెక్కి మిక్కిలిన్
గ్రిక్కిరి సొక్కమానమయి ♦ గ్రిక్కినఁ బక్కన విచ్చునోయనన్
బిక్కటి లుక్కమీటి తగు ♦ బింకపు నీచనుదోయి మాటునన్
జిక్కిన నేమొకాని మఱు♦చేఁ బడరాదికఁ బ్రాణనాయికా!

చ. వెర వికఁ నేది నాకకట! ♦ వీఁడె మనోభవుఁ డేగుదెంచె వి
స్ఫురదళిశింజినీవికచ♦సూనశిలీకధనుఃపికావళీ
వరకలకంఠకాహళర♦వస్ఫుటకంపిత భూర్భువస్సువ
శ్చరుఁడగుచున్ బ్రతాపమున ♦ నల్పెడిదేమిఁకఁ బ్రాణనాయికా!

ఉ. ఎక్కడ నేదరింతు నిఁక ♦ నేవగఁ బ్రాఁదుఁ బ్రాణవాయువుల్
చిక్కతి మన్మథాగ్నిఁ గడుఁ ♦ జేసెడి దేమిఁకఁ గంబుకంఠి, యో
చక్కనికీరవాణి, జల♦జాతవిలోచన, పుష్పగంధి యే
చక్కటినున్నదానవు ని♦జంబుగ నా కెఱుఁగంగఁజెప్పవే.

ఉ. నన్నెడఁబాయఁజాల నొక♦నాఁటికిఁ గంటికి ఱెప్పకై వడిన్
గ్రన్ననఁ గప్పుకొందు విడె ♦ కంతుని బారిని దూరఁజిక్కితిన్
సన్న యొఱంగి మున్న రతిఁ ♦ జల్లనితీయని ముద్దుకౌఁగి లిం
కెన్నఁడు నాకు నిచ్చెదు ♦ మృగేక్షణ, పుష్పసుగంధి, చెప్పవే.

వ. అని విరహావేదనం బొగిలి పొగిలి మున్ను పుష్పసుగంధియు దానుం గూడియుండెడు నుద్యానవనంబులోపలికి నరిగి యిట్లనియె.

సీ. హరిణంబ, కానవే ♦ హరిణాయతాక్షిని
మధుపంబ, కానవే ♦ మధుపవేణి
హంసంబ, కానవే ♦ హంసేంద్రగామినిఁ
బులినంబ, కానవే ♦ పులినజఘనఁ
గలకంఠ, కానవే ♦ కలకంఠకంఠిని
గిసలయ, కానవే ♦ కిసలయోష్ఠి
నవలత, కానవే ♦ నవలతాతన్వినిఁ
గీరంబ, కానవే ♦ కీరవాణిఁ

తే. గీ. గానవే రంభ, రంభోరు♦కాంతయుగళిఁ
చక్రవాకంబ, కావవే♦చక్రకుచనుఁ
బుష్పవనవాటి, కానవే ♦ పుష్పగంధిఁ
జందురుఁడ, కానవే పూర్ణ♦చంద్రముఖిని.

సీ. విను సుధాకరుఁడవు ♦ విష మేల కురిసెదు
చందమామా నీకిది ♦ చందమామ,
శీతాంశుఁడను పేరు ♦ చెఱచి నిప్పులు గ్రక్కఁ
జందమామా నీ కిది ♦ చందమామ,
కువలయాప్తుఁడవయ్యుఁ ♦ దవిలి పాంథుల నేఁపఁ
జందమామా నీకిది ♦ చందమామ,
శివునకు నవతంస♦మవు మరుఁగూడంగఁ
జందమామా నీకిది ♦ చందమామ,

తే. గీ. విబుధులను బ్రోచుదాతవు ♦ వినుము నీవు
సుద్దములు బద్దములు గావు ♦ సుస్థిరాత్మ
నఖిలకళలందుఁ బ్రోడవై ♦నట్టి నీకుఁ
జందమామా హింసగావింపఁ ♦ జందమామ.

కం. అచ్చిన ప్రియసతిఁ బాసిటు
వెచ్చుచునున్నట్టి నాకు ♦ వేఁడిమిఁ జూపన్
వచ్చిన చోటికి వచ్చెదు
నిచ్చో ఫలమేమి నీకు ♦ నిందుఁడ యనుచున్.

వ. అని మలహణుండు దుఃఖావేశంబున ;

కం. కలయంగఁ గలుగు భాగ్యము
కలుగుట దుర్లభము చూడ ♦ గల్గిన యేనిన్
గలసినయంతయు లేదా
వెలఁదుక నీమాటలైన ♦ విన్నం జాలున్.

వ. అనుచు మదనోన్మాదంబున మలహణుండు "కామాంధో ఒపి నపశ్యతి" యనియెడుం గావునఁ దన ప్రియురాలిం దలంచుకొని పుష్ప సుగంధయున్న మేడ సమీపంబునకుఁ జనుదెంచి నిలిచి నాయికమాట లాలకించుచుండె. అంత నప్పొలంతియు మలహణుం దలంచి యంతః పరితాపంబు వారింప నుపాయంబు లేక యెంతయు.

సీ. ప్రేమతోఁ బ్రియుఁడు చెప్పినగీతము లాడి
యడరి డగ్గుత్తికపడి నిలుచును
సోమార్ధధరుమీఁది చూర్ణికల్ చదువుచు
హా ప్రాణనాయక, యని తలంచు
జంత్రంబు చూపుచు జాగులే వల్లభ,
నినుఁబోల నెవ్వరు నెనయ రనునుఁ
దానమానములకుఁ దలయూఁచి మలహణ,
యెఱుఁగుదుగా నీవు నించుకనును

తే. గీ. సుదతి ప్రాణేశు లోఁచూడ్కిఁజూచి పొక్కి
బయలుఁ గౌఁగిఁట నిఱియించుఁ బరవశమున
నధరసుధఁగ్రోఁగి పోవంగఁ గలఁగి కలఁగి
యెందు నున్నాఁడవో నన్ను నిచట నొంటి
డించఁదగవౌనె ప్రాణేశ, యంచు వగచు.

సీ. అతనిసుద్దులు ప్రేమ నందంద తలపెట్టు
నతఁడు దిద్దినచిల్క నడుగు మాట
లతఁడు చెప్పిన కత లర్మిలి వచియించు
నతనికై వడిఁ బాట లడరిపాడు
నతఁ డాడుసరసోక్తు లల్లనఁ బచరించు
నతనిగుణంబులె యభినుతించు
నతనిఁ గూడాడిన యచ్చోటులే యెంచు
నతనిభావమె తనయాత్మనించు

తే. గీ. నతఁడుఁ దాను ముట్టిన ♦ యట్టిమతులు
ముట్టి తలయూఁచి తనుఁదానె ♦ తిట్టుకొనుచుఁ
జెలఁగి యాతఁడు దానును ♦ గలయు భావ
మంత భావించి శంకరా, ♦ యని తలంచు.

సీ. వెలఁది నిట్టూర్పులు ♦ వెలికిఁ బైపడనీక
పూబంతిమీఁద నేర్పున వహించు
గుక్కుచుఁ గన్నీళ్లు ♦ కొలుకులఁ గ్రమ్మఁగ
నలుసు సోఁకినదని ♦ పులిమి తుడుచుఁ
దనువల్లి కాఁకఁ గ్రాఁగినపాన్పు కొప్పివ్విరుల్
కనుపడనీయక ♦ వెనుకఁద్రోయు
వదలని తాపాగ్ని ♦ వడచల్లు నురుబెట్ట
పోరెఁబొరెఁ దిప్పుఁ గప్పురపుసురటి

తే. గీ. ప్రాణవిభు నాత్మ భావించుఁ ♦ బలవరించు
వెలికిఁ జను నిండు వెన్నెల ♦ వేఁడికంత
నులికి లోఁజను నందును ♦ నుండ లేక
పొగిలి వగబొంది మదిఁగుంది ♦ పుష్పగంధి.

కం. ఇందునిచే నోడ లుడుకన్
గుందును వెలి లోన మాడు♦కొలువులచూఁడన్
ఎందు సహింపదు దైవము
ముందఱ నుయి వెనుక బొంద♦మొగి నను టయ్యెన్.

కం. ఈవేళ మత్ప్రియుండగు
జీవితపతి మోముఁజూడఁ ♦ జేకుఱెనేనిన్
దైవంబు కరుణ నాపై
నేవిధమునఁ జాలఁగల్గు ♦ నెఱుఁగఁగ వచ్చున్.

తే. గీ. చంద్రకాంతపు గిండి వా♦ననజలంబుఁ
గొనుచు వాకిటి కరుదెంచి ♦ కువలయాక్షి

వెడఁదకన్నులుఁ బెదవులుఁ ♦ దడుపుకొనుచు
నుమ్మలిక నొయ్యఁ బుక్కిలిం♦చుమియుటయును.

తే. గీ. దక్షరము చేత నాచులోఁ ♦ దమ్మివిరిని
నున్న యెలతేఁటిపైఁ దేనె ♦ యొలికినట్లు
మలహణునిమీఁదఁ బడియె నా♦జలకణములు
మదనసంతాపవహ్నికి ♦ మాటుదోఁప.

వ. అప్పుడు మలహణుండు శివస్మరణంబుసేసి తనలోనిట్లనియె

కం. కన్నప పుక్కిటనీటన్
గన్నప కీర్తులఁ బాసెఁ ♦ గటకట, నేఁడీ
కన్నియ యధరామృతమును
గ్రొన్ననగాఁ గవయుకతన ♦ గౌరీశునకున్.

ఆ. వె. అనిన పలుకు చెవుల ♦ నాలించి ప్రాణేశుఁ
డాట యెఱిఁగి యొయ్య ♦ నతనిఁగదిసి
యెట్లు వచ్చితిచటి ♦ కివేళ యనుచును
ముదము భయము మదిని ♦ ముడివడంగ.

ఆ. వె. బిగియఁ గౌఁగిలించి ♦ బింబాధరము చవు
లిచ్చి యిచ్చి కోర్కి ♦ యిచ్చ వగచి
ప్రాణనాథ, నీవుఁ ♦ బాడియె యొక్కఁడ
విట్లు లరుగుదెంచు ♦ టెఱిఁగి మఱియు.

సీ. గ్రుక్కనఁ దలవరుల్ ♦ గని పట్టుకొనిరేని
నరయ నాదోష మెం♦వ్వరికిఁ దగులుఁ
బఱతేర నచ్చటఁ ♦ బాము దే లంటిన
నాహత్య యెవ్వరి ♦ కతిశయిల్లు
మీ తల్లిదండ్రు లోం♦మియుఁ బుత్రశోకాగ్నిఁ
గన నది యెవ్వరి ♦ కొని ముసుంగుఁ

గావలివార లొ♦క్కంత యొతింగిన
నాడిక యెవ్వరి ♦ కతిశయిల్లు
తే. గీ. నడుమ ననకార్యమేమైనఁ ♦ బొడమెనేని
నట్టి కింకయు నెవ్వరిఁ ♦ జుట్టుకొనును
నెఱయ సకలంబుఁ దెలిసిన ♦ నిపుణమతివి
యకట పఱచుట ప్రాణేశ, ♦ యర్హమగునె?

శా. చెల్వంబును నీవిలాసము మఱిన్ ♦ నీధైర్యగాంభీర్యముల్
నీచాతుర్యము నీగుణాంక మహిమల్ ♦ నీపెంపునుం జూడకే
పాపిచుర్యంబును బోవనాడితివి యీ♦పాపంబు ప్రాణేశ, నా
కేచందంబునఁ బాసిపోవు నకటా! ♦ యెన్నేనిజన్మంబులన్.

వ. అని దుఃఖావేశంబునఁ బొగులుచు:

కం. కదుఁ గాకలీస్వరంబున
విడువక యొయ్యొయ్యనవల ♦ వెక్కుచునేడ్చెన్
కడవలను గ్రుమ్మరించిన
వడువునఁ గన్నీరు మేన ♦ వఱదై పాఱన్.

కం. సూనశరవహ్నిఁ గ్రాఁగుచు
మేనంతయుఁ బలుకఁబాఱి ♦ మిగులఁ గృశించెన్
నానోముఫలము లిట్టివి
ప్రాణేశ్వర, నిన్ను నేచఁ ♦ బాలయితిగదే.

ఆ. వె. కుటిల వర్తనంపుఁ♦గులమున జన్మించి
చెడుగులకును బుద్ధి ♦ చెప్పఁగాని
పుణ్యనిధివి నిన్నుఁ ♦ బొందొందుభాగ్యంబు
నాలి దైవమేల ♦ నాకు నిచ్చు?

కం. వఱదం బడిపోయెడు సతి
కురవడియు న్నొగులుమాన్ప ♦ నోపునె తానె

తెఱఁగున వీరలచేఁ బడి
యుఱక నినుం బాసి నొగులుచుండఁగ వలసెన్.

కం. వ్యాళీవిషదంష్ట్రాగ్ని
జ్వాలల సయిదోడులగుచు జనియించిన దు
శ్శీలలల వేశ్యామాతల
నేలా పుట్టించె నజుఁడు నెఱుఁగఁడు సుమ్మా!

సీ. గుబ్బాల సారక కొండగాఁజేయును
నీవస్తు నెంతయుఁ జావ నలుగుఁ
బలుగాకులను గన్నఁ బ్రాణంబు లోసఁగును
నినుఁ జూచెనేనియుఁ గనలిపడును
ధనులకెంతయు హిత మాచరించును
నీపట్టు కన్నంతఁ ద్రోపుసేయుఁ
జెడుగులఁగన్నను శిరసావహించును
నీవారమన్నను నిలువనీదు

తే. గీ. వినుము యలవోక నీపేరు విన్నమాత్ర
రాఁజుచుండును మోము ని*రంతరంబుఁ
జిత్తమలరంగ నీవును జేయునట్టి
భాగ్యమబ్బునె పరమ నిర్భాగ్యులకును.

సీ. కడముట్టఁ దల్లిచేఁ గసికోఁతలేకాని
యొకనాఁడు హాయిని నుండలేదు
పొన్నిండ్లఁ బడిపంచఁ బొగులంగనేకాని
యొకనాఁడు నినుఁగూడి యుండలేదు
కరకరలును వట్టి కక్కసంబులె కాని
యొకనాఁడు నుడుకారి యుండలేదు
ఎవ్వరు విందురో యిది యననేకాని
యొకనాఁడు నిశ్చింత నుండలేదు

తే. గీ. నీవు నాకయి యాహార • నిద్ర లుడిగి
యుండు మన్నట్టి చోటనె • యుండియుండి
చిక్కి నరమైతి వేమని • చెప్పదాన
నిట్టి దశకును మనకింక • నేది తెరువు.

కం. వచ్చెద నే నీవెంటను
నెచ్చోటికినైనఁ గొంచు • నేఁగుము లేదా
యిచ్చట నేనుటసేయుము
పచ్చనివిలుకానిబారిఁ • బడఁజాలఁ జుమీ.

వ. అనుటయు మలహాణుం డిట్లనియె.

ఆ. వె. వెఱ్ఱి బమ్మరించు • విధమున నాకును
బుద్ధి చెప్పి నీవు • పోగులఁ దగునె
యూర్మి వెఱ్ఱి దిరిగె • రోఁకలిఁ దలఁజుట్టు
మనిన చందమయ్యె • నంబుజాక్షి!

వ. అనుటయు నప్పుడేలకు ధైర్యంబుఁ దెచ్చుకొని యరుణోదయంబునఁ ద్రిపురాంతకుని గుడికి నృత్యంబు సలుప నేను వచ్చెద నచ్చట నుండు మని నీవును నేనును దానికిఁ దగిన తెఱఁగు చూచుకొందమని మలహాణు నంపి తానును గ్రమ్మరవచ్చునెడ నటమున్న యవ్వేశ్యాంగనయు.

ఆ. వె. కౌఁగిలింపలేదు • కడుపేదక్కఁ గెమ్మోవి
యానలేదు రతికిఁ • బూనలేదు
సుదతివలన వట్టి • సుఖ్ఖులు దుఃఖులు
గతులు మతులుఁ జాలుఁ • గాని యనుచు.

కం. వ్యథఁ దల్పుగడియ పెట్టియు
శిథిలాత్ముఁడు దాసితోడఁ • జెనకుచునుండెన్
క్షుథనొందినట్టి పిల్లికి
విధిమూడిన యెల్క లేదె • వెదకిన నైనన్.

వ. ఇట్లున్న యవ్వైశ్యుని గెళవునంజూచి రోయుచుఁ గవాటబంధ నంబుఁ సేయించి విలాసినింగావలిం బెట్టి కృతస్నాతయై వివిధభూషణభూషితాంగి యయ్యె నంత.

కం. తారాగణపరివారము
తారాగిరిరాజువెంట ♦ దండుకుఁ బనుపన్
చీరికి దరుబోయి నగరు
నోరన్ వేగుఁజుక్క ♦ తూర్పునఁ బొడిచెన్.

సీ. ఇందు ... బుధిఁ ...డి ♦ యిస్మగోల్మిని వెట్టి
కరఁగించు కిరువుము♦ఖం బగ
... రావతంబున ♦ కలికభాగంబునఁ
బోన జేగురు ♦ బొట్టునంగ
నెఱతినంబున విధి ♦ నిర్మించి మించిన
కరమొప్పు పసిఁడిప♦ళ్లెర మనంగ
పాగ్విధూమణి హస్త♦పంకజంబునఁగల
పొలుపారు మంకెన♦పూ వనంగ

తే. గీ. నుదయగిరిమీఁద నప్సరో♦యువతు లిడిన
నిద్దపుటొప్పు కుంకుమ♦ముద్ద యనఁగఁ
బ్రాగ్విధూమణి సొమ్ముల ♦ బరణియనఁగఁ
దరణి యుదయించె సుప్రభా♦సరణి మెఱయ.

వ. అంత మేళంబులవారితోడఁ బుష్పసుగంధి త్రిపురాంతక దేవుని గుడికేఁజని నృత్యగీతవాద్యంబులు సలిపి పరిజనంబులం బదండని మలహాఖం బిలుచుకొని గర్భద్వారంబున నిలిచి యద్దేవునిం జూపి యిట్లనియె.

సీ. ముక్కంటి భక్తుల ♦ ముంగిటిపెన్నిధి
చిత జనరి సం♦జీవికరణి
పురదైత్యలోకసం♦హారుఁడు సిద్ధరసంబు
బాలచంద్రధరుండు ♦ పరుసవేది

శ్రీపార్వతీశుండు ♦ చింతామణిశ్రేణి
కుండలికటకుండు ♦ కొంగుపసిఁడి
రుద్రుండు దక్కి-న♦రోహణశైలంబు
ఖండేందుమౌళి బం♦గారుకొండ

తే. గీ. యసమనేత్రుండు నింకని ♦ యమృతజలధి
కాలకంఠుండు చేరువ ♦ కల్పశాఖి
విశ్వనాథుండు మనపాలి ♦ వేల్పుటావు
తలఁపు మిషుండు కామితా♦ర్థములు గలుఁ.

కం. శతధృతిశతమఖముఖ్యుల
కతిదుర్లభుఁ డెన్నిచూడ ♦ ననవరతంబున్
మతిఁదలఁపఁగ సద్భక్తుల
కతిసులభుఁడు దేవదేవుఁ ♦ డభవుఁడు జగతిన్.

కం. ఇల బాణమయూరాదుల
కలరెన్ గోర్కులు కవిత్వ♦మందునె కాదా
వలనగుఁ గవితాతత్త్వము
వలనంబడయంగరాని ♦ వస్తువు గలదే.

కం. పరిమళములలోఁ గస్తురి
తరువులలో జందనంబు ♦ దైవంబులలోఁ
బరమేశుఁడు విద్యలలో
నరయంగాఁ గవిత యెక్కు♦డగునని రార్యుల్.

కం. మాటలె ధనములమూటలు
మాటలె భువనైకముఖ్య♦మంత్రౌషధముల్
మాటలె ముక్తికి నెలవులు
మాటల నొనఁగూర్చి చెప్ప ♦ మతమదియొనన్.

సీ. ప్రకటింప మేఁకపెం♦ట్రుక లింగమని కొల్వఁ
గోర్కు లీయఁడె కాల♦కోటనికిని
బ్రమదంబుతోడఁ గుం♦చము లింగమని కొల్వ
[1]గోష్ఠియవానికి ♦ గోర్కు లీఁడె
లీలమై సతిచన్ను ♦ లింగమంచు భజింప
నొడయనంబికి నీఁడె ♦ యడుగు కోర్కె
తమకంబునను [illegible] క♦తము లింగమని కొల్వ
నిచ్చఁగోటికి నీఁడె ♦ యుర్విఁ [illegible]
తే. గీ. నిముసమాత్రంబు [illegible] ♦ నిలుపు దృష్టి
తలఁపు లితరంబులందునుఁ ♦ దగులనీకు
మించుదళుకొత్తఁ గొన్ని[illegible] ♦ మెఱుఁగుఁగవిత
చెప్పి సర్వేశు సన్నిధ♦సేయు మనిన.

కం. తరుణీ, నామన సెంతయు
నరయఁగ నీమీఁదఁ దగిలి ♦ యన్యంబులపై
నరనిముసమైన నిల్వదు
వెఱ వెయ్యది యనినఁ బలికె ♦ వెలఁదుక మఱియున్.

కం. చనుఁగవ వీపున నానుక
నినుఁబాయక కౌఁగిలించి ♦ నేనుండెద నీ
వెనుకను, నిశ్చల మతివై
కొనియాడుము శంభుఁ గోర్కె ♦ కొనసాగంగాన్.

చ. అటువలె నుంటివేని జల♦జానన, యేనును నాదిభోగిరా
ట్కటకు నమాశతుశ్రిశితి♦కంధరు సన్నుతిచేసి నీదు ముం
దట నటమెచ్చు చేకొనియె♦దన్ విను నావుడు నింతి యట్ల కౌఁ
గిటఁ గదియించె భక్తిఁ బలి♦కించె శివుఁ నుతియించె నాతఁడున్.

1. పా. కోమటివానికి ♦ గోర్కు లీఁడె.

చ. తరుణిశశాంకఖండము కొలిచ్చిరులంతా నీకెఁ జూసన నేఁటి యట్లు శం
కరుఁ డీలఁ దేఁటియో యనుచుఁ గామిని దెల్పుట కంధ కప్రమక
ర్బురనిభకంధరాయ సుర ప్రాంశుతపాదసరోరుహాయ భా
స్కరశశిలోచనాయ పుర సంహారిణాయ నమోనమో యనన్.

సీ. జడముడి వ్రాలఁ కాడు జాహ్నవీ నదితోడ
మే నగమున నున్న మొలఁతతోడ
పక్కలఁ బ్రణుతించు ప్రమథ వర్గముతోడ
జయవెట్టు దేవతా సమితితోడ
బొగడెడు బ్రహ్మాండ పునుక పేరులతోడ
నటన మిన్నందిన నందితోడ
గాలిచే నల్లనఁ గదలుసొమ్ములతోడఁ
బులితోలుపట్టు దువ్వలువ తోడఁ

తే. గీ. బొలుపుమిగిలిన వలపు వి భూతితోడ
మహిమ దళుకొత్తు రుద్రాక్ష మణులతోడఁ
గ్రమ్మునొదల చంద్రఖండ మమ్ముతోడ
నమరి సర్వేశ్వరుఁడు ప్ర త్యక్షమయ్యె.

కం. మెచ్చితి మలహణ, కోరిక
లిచ్చెదనేమున నడుగు మిహపరములలో
నిచ్చకు వచ్చిన పిమ్మట
నచ్చిన నెచ్చెలివి నీవు నాకెన్నంగన్.

వ. అనుటయుఁ బునఃపునః బ్రణామంబు లాచరించి యిట్లనియె:

సీ. పూజింతుఁ బుంగవ పుంగవకేతను
నర్చింతు మారుతా హారహారు
వర్ణింతు నాత్మీయ వామాంగ వామాంగు
భజియింతు నిర్జిత బాణబాణు

వినుతింతు శరశుభ్రి•విగ్రహవిగ్రహు
భావింతు శతకోటి•భానుభాను
నుతియింతుఁ బదపద్మ•నతభంజభంజను
మది సంస్మరింపుదు • మారమారు
తే. గీ. నంతకాంతకు నేప్రొద్దు • నాశ్రయింతుఁ
గరము వేడ్క నుపాసింతు • శరధిశరధి
లీల సేవింతు హరినీల•నీలకంఠు
నెలమి నినుఁ గొల్తు భువనత్రి•యీశు నీశు.

కం. భేశ వృషభేశ కాశా
కాశధునీసుప్రకాశ • గౌరాంగునకున్.
కేశవనుతునకు నంబర
కేశునకును శరణు నీకు • గిరిజాధీశా !

కం. పాటలపాటలమకుటని
శాటునకున్ గలుషజలధి•జంఝాటునకున్
శాటీకృతమదకరటిని
శాటనవచర్మునకును • శరణము నీకున్.

కం. ఖండశశిఖండమాళికి
నండజకేతనమదాండ • జాండావళికిన్
లస
త్కుండలికిని శరణు నిఖల • గురునకు నీకున్.

కం. ఈపుష్పగంధిఁ గూడుక
యేప్రొద్దును ప్రమథవరుల • నీక్షింపుచు నీ
శ్రీపాదపంకజంబుల
నేపారఁగఁ గొల్చుభాగ్య • మీవే నాకున్.

వ. అనుటయు నద్దేవదేవుం డతనిం గారవించి యభీష్టంబులొసంగి తజ్జనకజనయితృలకు బుష్పగంధి జననికిఁ గేలికీరంబునకుఁ గైవల్యం

బొసంగి యేతచ్చరిత్రంబు విన్నవారలకు భోగమోక్షప్రాప్తంబులు గలుగం జేయుచుఁ బార్వతీ సమేతుండై పరమేశ్వరుండు ప్రమథగణంబులు గొలువ రజతాచలంబున కేఁగి వినోదించుచునుండె నంత :

కం. ఈమలహణచారిత్రముఁ
బ్రేమంబున వ్రాయఁజదువఁ ♦ బేర్కొన మనుజుల్
కామితసుపుత్రపౌత్ర
శ్రీమహిమైశ్వర్యములను ♦ జెలఁగుదు రర్థిన్.

ఉ. మందరధీర ధీరకవి మానితనిర్మలకీర్తిమల్లికా
సుందరకంఠ, కందళిత ♦ శుద్ధమనఃకృతిపార్వతీశ పై
నందినపూజనస్తవ జ ♦ నస్తవనీయదయాకులాశయా
స్పందిత దివ్యముఖ్యగుణ ♦ బంధుర బంధురమావిధాయకా.

కం. రామామాత్యకుమారక
సోమాంబాగర్భసింధు ♦ సురుచిరసోమా
రామాజనమానసలతి
కామాధవ విస్సమాంబి ♦ కాప్రాణేశా !

మాలిని.

శరధినిభగభీరా శత్రుగర్వాపహారా
నిరుపమగుణహారా నీతిమార్గప్రచారా
పరిజనపరిచారా బంధుకల్పావిహారా
సురగిరివరధీరా సోమమాంబాకుమారా.

గద్యము.

ఇది శ్రీమత్సకలసుకవికుతిర సోమయామాత్యపుత్ర సరసకవితాధుర్య
యెఱ్ఱయనార్య ప్రణీతంబైన మలహణచరిత్రం బను
మహాప్రబంధంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము.
సంపూర్ణంబు.

# తప్పొప్పులు.



| పుట. | బంతి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 9 | హాశించు | హాసించు |
| 2 | 7 | గొని•తొర | కొని•తోర |
| 3 | 9 | నవ్వ | 'నవ్వ |
| 3 | 17 | సర్య | సర్వ |
| 8 | 3 | ధాన | దాన |
| 15 | 27 | ధూషణు | భూషణు |
| 19 | 22 | •బొమ్మ | బొమ్మ• |
| 29 | 9 | లగదే | గలదే |
| 43 | 7 | కింకిణి | కింకిణీ |
| 75 | 6 | నన్న | సన్న |
| 86 | 17 | జ(ద | జంద |
| 90 | 8 | ంచె | నీచె |
| 93 | 10 | బగ | బసంగ |

XZX

రాఁబోవు 6 వ గ్రంథము.

# యామినీపూర్ణతిలకావిలాసము

నెల్లిపల్లి వరసయ కవికృతము.

[ ఈ శృంగార ప్రబంధ మాఱాశ్వాసములు గలిగి 1893 సంవత్సరః దునిగ్రామమున గుజిలీప్రతిగాఁ బ్రకటింపఁ బడినది. ప్రతియాశ్వాసమునను గుజిలీ లేని పద్యములుగల సంపూర్ణప్రతిని సంపాదించి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగా తాళపత్రులతోడను ఇతరములైన కాగితపుఁబ్రతులతోడను సంప్రతించి పాఠాలతో సహా త్వరలో సంపూర్ణప్రతిని బ్రకటింపఁగలము. ]

(ఉదాహరణముగా గుజిలీప్రతిలోలేని కొన్ని పద్యములు.)

చ. చిఱునగుమోము తోఁ, నుదుటఁ ♦ జిందెడి యందపుటుంగరంపుముం
గురులమెఱుంగు తోఁ, జెమట ♦ క్రొందళుకూనినమోముదమ్మి
నెఱిమగపోడిమిన్ గెలుపు ♦ నెక్కొనువేళ గళస్వనంబుఁ బ
ల్మరు సిరు లొందఁ జేయు వగ ♦ లాఁడిని దానిఁ దలంతు నేఁటికిన్

చ. మది నొకతీరు నున్నతఱి ♦ మన్నన నన్నెనయింప నెచ్చెలిం
గదిసి మదీయగేహసుము ♦ ఖాద్వగయై, భయకంపితాత్మయై
పదవి నిషణ్ణయై, గతిశ ♦ భస్థితయై పరివర్తమానయై
ముద మొనరించు దాని వగ ♦ ముచ్చటఁ దీర తలంతు నేఁటికిన్.

చ. చనుఁగవ మీటునన్ దొలఁగ ♦ జారినపయ్యెదఁ జక్కఁ జేయు ప
ల్లను గని నాదు నేత్రజవి ♦ లాసము నేత్రవిలాస మౌ గదే!
వనరుహనేత్ర యంచుఁ దని ♦ వారఁగఁ బల్కిన మెళ్కువ న్మనం
బున నగి నన్నుఁ జూచు చెలి ♦ ముంగలి గయై కనుపించు నేఁటికిన్.